# ఈ సంచికలో

జూన్ 1986





ముఖచిత్రం
చిన్నారి చేతుల్లో చిలుక


విసడమ్
అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక

సంపాదకవర్గం:
సంపాదకుడు:
లయన్ కె.వి. గోవిందరావు
గౌరవ సహాయ సంపాదకులు:
టి.ఎల్.ఎన్. రావు
వి. బాలకుమార్
సభ్యులు:
కె.వి.ఎస్. గోవిందరావు
కె.వి.ఎస్. శరత్‌బాబు
కె.వి.ఎస్. విజయకుమార్
కె. రత్నకుమారి

చందా వివరాలు

అభిమాన జీవిత చందా రూ. 1000/-
జీవిత చందా . . . రూ. 300/-
3 సంవత్సరాల చందా . రూ. 70/-
సంవత్సర చందా .. ... రూ. 24/-
ఎయిర్ మెయిల్ (1 సం॥) రూ. 100/-
సీ మెయిల్ (1 సం॥)..... రూ. 60/-

చందా పంపవలసిన చిరునామా
విసడమ్
9 దేశికారోడ్, మైలాపూర్
మద్రాసు - 600004


**తెలుగు విస్డమ్‌కు ఇది ఐదవ సంవత్సరం**



# నీ మనస్సును నీవు నిభాయించుకో



జేమ్స్ ఎలెన్

ప్రపంచంలో బ్రహ్మాండమైన ఘన కార్యం నెరవేర్చి విజయం సాధించడానికి ముందు నీ మనస్సును నీవు నిభాయించుకుని స్వాధీనంలో ఉంచుకోడం నేర్చుకోవాలి. బాహ్య విజయాలకంటే మానసిక విజయాలు గొప్ప.

నీ జీవితంలో ఎన్నెన్నో సమస్యలు ఉంటాయి ఈ సమస్యలన్నీ నీ మనస్సులో నుంచి పుట్టినవే; ఇంకోచోట నుంచి పుట్టవు. స్వాతిశయం. అహంకారం, కామం, క్రోధం మొదలైన దుర్గుణాలతో కప్పబడిపోతుంది

(మిగతా 58 వ పేజీలో)



# ఆడినమాట తప్పరాదు

ఇచ్చిన మాటను నిలబెట్టుకోడం అందరూ నేర్చుకోవాలి. ఇదే మొదటిపాఠం. సత్యమే పరమధర్మం. దానిని మించినది మరొకటిలేదు. సత్యాన్ని పరిపాలించాలి. చేసిన ప్రతిజ్ఞను జవదాటకూడదు ఒకరికి నీవు ఖరారు చేసావు అంటే వారు అన్నివిధాలా నిన్ను నమ్ముకుని ఉంటారు. నీ మీద ఎన్నో ఆశలు పెట్టుకుంటారు. ఇచ్చిన మాట తప్పిపోతే భగ్నహృదయులు అవుతారు. నీ మీద వారికి నమ్మకం పోతుంది. అపనమ్మకం కలుగుతుంది. జన్మలో నిన్ను నమ్మకూడదని నిర్ణయించుకుంటారు. తలిదండ్రులుగా మన పిల్లలకు ఎన్నో ఉత్తమ విషయాలను నేర్పి అభ్యసింపచేయవలసిన బాధ్యత మనకు ఎంతైనా ఉంది.

మొట్టమొదట అబద్ధమాడకుండా సత్యాన్ని పలకడం నేర్పాలి ఉన్నది ఒక్కటే సత్యం. సత్యం తప్ప మరొకటి లేదు. సత్యోపాసకులు అయితే పరమ సంపదలు లభిస్తాయి. లోపల, బయట సత్యాన్ని సాక్షాత్కరింప జేసుకోవాలి. మనకు కళ్ళు ఉన్నా కళ్ళతో సరిగ్గా చూడం. మనకు చెవులు ఉన్నా చెవులతో సరిగ్గా వినం. మనకు బుద్ధి ఉన్నా వక్రబుద్ధితోనే యోచిస్తాం. అందువల్లే అంతా అబద్ధంగా తోస్తుంది. అన్నీ అసత్యంగా కనిపిస్తాయి.

"లోకంలో ప్రతీ పని మానవ ప్రయత్నంపైనే ఆధారపడి ఉంది."

అంతా మాయగానే ఉంటుంది.

చెప్పిన మాటను అనుసరించాలి. మాట ఇస్తే ఆ మాటను సర్వవిధాల నిలబెట్టు



కోవాలి. ఒకరితో ఒక విషయాన్ని గురించి ముందుగా నిర్ణయించుకున్నప్పుడు తీర్థయాత్ర చేసుకుని దారిలో బంధువులను చూసుకుని ఫలానా రోజున బయలుదేరి వస్తున్నాను, తిరిగి దీని విషయం వ్రాస్తాను అంటే సకాలంలో జాబు వ్రాసి విషయం తెలియజేయాలి. నిర్ణయించిన రోజుకు రావాలి. ఆ నిర్ణయం నీకు అసాధ్యమని తోచినప్పుడు వెంటనే చివరి నిమిషం దాకా ఆగకుండా ముందుగానే తెలియజేయాలి నీ కోసం ఇతరులను కాచుకుని ఉండేటట్లు చేయకూడదు. నిన్ను నమ్మరు. నీ మీద అపనమ్మకం ఏర్పడుతుంది. నిన్ను విశ్వసించరు. నీ మీది అపనమ్మికకు, నీ అపకీర్తికి నీవే కారకుడవు అవుతున్నావు.

నీకు ఇష్టంలేనప్పుడు 'సరే' అని ఒప్పుకోడం కంటే నీ అసమర్థతను ఉన్నది ఉన్నట్టు చెబితే తప్పకుండా సంతోషిస్తారు. ఈనాడు ప్రజానీకంలో ఏ బహుకొద్ది మంది మాత్రమే చెప్పిన మాటను నిలబెట్టుకుంటారు. స్నేహితులలో, బంధువులలో పరస్పరం అపనమ్మకం పెచ్చు పెరిగిపోతూంది. ఇదే దేశాలలో, రాజ్యాంగాలలో కూడా పరిణమించింది. ఒడంబడికలు, ఒప్పందాలు ఏర్పరచుకున్నప్పుడు వాటిని తప్పించుకోడానికి వీలు లేకుండా నిర్ణయాలు, నిబంధనలు కల్పించుకుంటాము. వివిధ దేశాలలో పెద్ద పెద్ద నాయకులు ఎన్నెన్నో వాగ్దానాలు చేస్తారు. చేసిన వాగ్దానాలను నిలబెట్టుకునేవారు ఎంత మంది? వాగ్దానం - దాన్ని నెరవేర్చకుండా ఉన్నంతవరకు - అని కేవలం మాటలు మాత్రమే. చేసిన వాగ్దానాన్ని మనం నెరవేరుస్తామని ఎదురుచూస్తూ, ఆ వ్యక్తి మానసికంగా చిత్రవధను అనుభవిస్తాడు. ఆదుర్దాతో, సంశయాలతో, ఆశలతో సతమతమై పోతూంటాడు. వ్యర్థవాగ్దానాలతో ఇతరులను వేధించ కూడదు.

తమను తాము సరిదిద్దుకోకుండా ఇతరులు సత్యసంధులుగా, విశ్వసనీయులుగా ఉండాలని ఆశిస్తారు. నిన్ను నీవు సరిదిద్దుకుని నువ్వు ఆత్మోన్నతి కలిగించుకోడం నీ మొదటి కర్తవ్యం. నువ్వు అబద్ధమాడకుండా ఉంటే లోకంలో అబద్ధాల కోరుల సంఖ్యలో ఒకటి తగ్గుతుంది!

## భారతదేశంలో తొలి జల విద్యుత్ కేంద్రం

భారతదేశంలో మొట్టమొదటి జల విద్యుత్ కేంద్రం 1898 వ సం. లో డార్జిలింగు (పశ్చిమ బెంగాల్)లో నిర్మింపబడింది.

# విటమినులు

కె. భార్గవి

మానవులకు పుష్టిలోపం వల్ల కలిగే అనేక రోగాలను పరిశోధించి మనం తినే ఆహార పదార్థాలలో ఆవశ్యకములైన 'విటమినులు'



తాజా కాయగూరలు

అనే పోషకాంశాలు కనుగొనబడ్డాయి. మనం ప్రతీరోజూ తినే ఆహారంలో ముఖ్యంగా శాకా సంబంధమైన క్యారటువంటి వ్రేళ్ళు, కంద, పెండలం వంటి దుంపలు, తోటకూర, బచ్చలికూర వంటి ఆకు కూరలు, జామ, సపోట మొదలైన పళ్ళు, బటాణీ, చిక్కుడు వంటి పప్పు సాధారణంగా మనకు కావలసిన విటమినులను అందజేస్తాయి. విటమినులనే పదార్థాలు రసాయనిక సమ్మేళనాలు. మన శరీరాభివృద్ధికి సూక్ష్మ పరిమాణంలో ఇవి అవసరం. వీటి లోపం రిక్కెట్లు, స్కర్వీ, బెరిబెరి, రేజీకటి వంటి తీవ్రరోగ పరిణామానికి దారితీస్తుంది. సాధారణంగా పాలు, ఆహారధాన్యాలు, కూరగాయలు, పళ్ళు, మాంసము చేరి సమతూక ఆహారంలో తగు రీతిలో అవసరమైన విటమినులు అన్నీ లభింపజేస్తాయి.

విటమినుల వర్గీకరణ: విటమినులు ముఖ్యంగా నీటిలో కరిగేవి కొన్ని, క్రొవ్వులో కరిగేవి కొన్ని అని రెండు రకాలుగా వర్గీకరింపబడ్డాయి. విటమిన్ 'సి' (ఎస్కార్బిక్ ఆసిడ్). సాధారణంగా విటమిను 'బి' అని చెప్పబడే విటమిన్లు $బి_1$ (థయోమైన్).

## మీరైతే...?

(ఏప్రిల్ 1986)

('శ్రద్ధ ఉంటే జ్ఞానం లభ్యమౌతూంది అంటే? )

"శ్రద్ధ ఎక్కడ ఉందో వెతుకుతాను జ్ఞానంకోసం."

—పడాల శివశంకర మూలారెడ్డి విజయవాడ.

* * *

"శ్రద్ధనే శరణు వేడుతా."

— సుంది దేవకుమార్, మద్రాసు.

'సమస్త దుఃఖాతీతమైన దివ్యజ్యోతిని ధ్యానించడం వలన చిత్త ప్రసన్నత కలుగుతుంది.'

విటమిను బి₂ (రిబోఫ్లోవిన్), విటమిను బి₆ (పెరిడాక్సిన్) ఫోలిక్ ఆసిడ్, నికోటినిక్ ఆసిడ్, పాంటోథెనిక్ ఆసిడ్. విటమిను బి₁₂ (కొబొలామిన్), బయోటిన్



బటానీలు మరియు క్యాబెజీ

మరియు ఇనోసిటాల్ నీటిలో కరిగే విటమినులు. విటమిను 'ఎ' (కెరోటీన్), కాల్సిఫెరాల్ (విటమిను డి), విటమిను 'ఇ' మరియు విటమిను 'కె' క్రొవ్వులో కరిగే విటమినులు.

తాజా ఆకుకూరలు, పసుపురంగు కూరగాయలు, పళ్ళు, టొమాటోలు, వెన్న తీయని పాలు, వెన్న మొదలైనవాటిలో విటమిను 'ఎ' కావలసినంత ఉంటుంది. విటమిను 'ఎ' లోపంవల్ల లివరు లేక ప్రేగుల సంబంధమైన రోగాలు సంభవిస్తాయి. రేజీకటి, ఇతర నేత్ర సంబంధమైన జబ్బులు ఎక్కువగా విటమిను 'ఎ' లోపంవల్ల ఏర్పడుతున్నాయి. ఇది రోజుకి 5,000 యూనిట్లు దాకా సిఫారసు చేయబడింది. దీనికి మించి విటమిను 'ఎ' తీసుకోవడంవల్ల తీవ్రమైన జబ్బులు రావడానికి అవకాశం ఉంది. విటమినులు పుచ్చుకోడం మానేస్తే అతిపోషకత అనే హైపర్ విటమినాసిస్‌ను నివారించుకోవచ్చు.

విటమిను బికాంప్లెక్స్ అనే 'బి' విటమినుల సమూహం అనేక రకాల ఆహార పదార్థాలలో లభ్యమవుతుంది. తక్కువగా పోషకాహారం తీసుకునేవారికి, మద్యపానం అలవాటు పడినవారికి విటమిను 'బి' కాంప్లెక్స్ లోపం కలగడం సహజం. ఆహార పదార్థాలనుంచి శక్తిని విడుదల చేయుటకు థయామైన్ (విటమిను బి₁) సహకరిస్తుంది. మాంసము, గ్రుడ్లు, కూరగాయలు, రొట్టె మరియు ఇతర ఆహారధాన్యాలలో

## అవివేకులు

"దేవతలుకూడా విహరించని
ప్రదేశాలలో అవివేకులు
విచ్చలవిడిగా విహరిస్తారు."
—అలెగ్జాండర్ పోప్

* * *

"తెలియని మూర్ఖునికన్న
తెలిసిన మూఢుడు పెద్ద
అవివేకి."

* * *

"అవివేకులు స్వానుభవంతో
తెలుసుకుంటే,
వివేకులు అవివేకుల అనుభవంతో
తెలుసుకుంటారు."
—మోలియెర్

* * *

"నిత్యానిత్యములు తెలుసుకోలేని
వారే అవివేకులు."
—శ్రీరామకృష్ణ.

"పుణ్యమనగా పరోపకారము, పాపమనగా పరపీడనము."

ఇది అధికంగా ఉంటుంది. ముఖ్యంగా ఆసియా ఆగ్నేయ దిక్కుగా నివసిస్తున్న ప్రజలు అధికంగా పాలిష్ చేసిన బియ్యం వాడుతూండటం వల్ల వీరిలో చాలా మంది థయామిన్ (విటమిన్ బి$_1$) లోపంవల్ల నరాలకు సంబంధించిన బెరిబెరీ రోగంతో బాధపడుతున్నారు.

రిబోఫ్లావిన్ (విటమిను బి$_2$) ఆహార పదార్థాలనుండి శక్తిని విడుదల చేయుటకు సహకరించడమేగాక సక్రమమైన జీర్ణశక్తికి, మంచి దృష్టికి, శరీరాభివృద్ధికి తోడ్పడుతుంది. ఇది పాలు, గ్రుడ్లు, ఈస్టు మరియు ఆకుకూరలలో విస్తారంగా లభిస్తుంది. గోధుమలు, చిరుధాన్యాలు, పప్పుదినుసులు మొదలైనవాటిలో రిబోఫ్లావిన్ అధికంగా ఉంటుంది. ఈ విటమిను లోపిస్తే ఆంగ్యులర్ స్టోమాటైటిస్, గ్లాస్సిటిస్, చెరిలోసిస్ మొదలైన రోగాలకు దారి తీస్తుంది.

మాంసము, కాలేయము, కూరగాయలు, ఇతర ధాన్యపు పొట్టులలో పైరిడాక్సిన్ (విటమిను బి$_6$) పుష్కలంగా ఉంటుంది. మనలో దీని లోపం అంతగా కనిపించదు. అయినా క్షయరోగ నివారక ఔషధాలవల్ల రోగులకు సంభవించే న్యూరైటిస్ (Neuritis) కు విరుగుడుగా ఉపయోగిస్తారు.

ప్రకృతిలో అతివిస్తారంగా లభించేది (ఫొలాసిన్) ఫోలిక్ ఆసిడ్. మనం వాడే ఆహారపదార్థాలలో ఈస్టు, లివరు, తాజా ఆకుకూరలు మొదలైన వాటిలో ఇది ఎక్కువగా లభిస్తుంది. మాంసం, పాలు, గ్రుడ్లలో ఇది అంత ఉండదు. డబ్బాలలో నిలువ చేయడంవల్ల, ఎక్కువగా ఉడకబెట్టడంవల్ల, ఉడకబెట్టిన నీటిని వార్చటంవల్ల, ఒకసారి వేడి చేసిన పదార్థాలను తిరిగి తిరిగి వేడిచేయడం వల్ల ఫోలిక్ ఆసిడ్ వ్యర్థమైపోతుంది. దీని లోపంవల్ల శరీరంలో రక్తహీనత సంభవిస్తుంది. ఉష్ణ ప్రదేశాలలో నివసించే పేదలలో ఇది సాధారణం. ఇంతేగాక గర్భిణి స్త్రీలకు గర్భధారణ సమయంలో అధికంగా కావలసిన ఆసిడ్ ఇది.

నికోటినిక్ ఆసిడ్ (నియాసిన్) ఎక్కువగా మాంసం, చేపలు, ఆహార ధాన్యాలు

## పాలజున్ను వినియోగంలో ప్రథమస్థానం నార్వేది



నార్వేలో ప్రతి వ్యక్తి సంవత్సరానికి 9 కిలోగ్రాముల పాలజున్నను ఆరగిస్తాడు. స్విట్జర్లాండ్, ఫ్రాన్స్‌దేశస్థులు వరుసగా రెండవ, మూడవ స్థానాన్ని ఆక్రమిస్తున్నారు.

"ప్రతీ చర్యలో నిష్కాపట్యము అవసరం,
మనలను మనం మోసగించుకొనుట గొప్ప తప్పు."

మరియు పప్పులు మొదలైన వాటియందు సులభంగా దొరుకుతుంది. ఎక్కువ నీళ్ళలో ఆహార పదార్థాలను ఉడకబెట్టడం వల్ల ఇది



ఉసిరిగ

నశించిపోతుంది. మన ఆహారంలో నికోటినిక్ ఆసిడ్ తగ్గిపోతే పెల్లాగ్రా అనే రోగం కలుగుతుంది. (చర్మం మీద పొలుసులు ఏర్పడతాయి. శరీరం మీద సూర్యరశ్మి తగిలినచోట ముఖ్యంగా చేతుల వెనుకభాగం, పాదాలు, ముఖం, మెడమీద వివర్ణత ఏర్పడు తుంది).

ఎక్కువగా శుభ్రం చేయబడిన రిఫైన్డ్ పదార్థాలు, అధికంగా సంస్కరింపబడిన ప్రొసెస్డ్ పదార్థాలు ఉపయోగిస్తేనే తప్ప పాంటోథెనిక్ ఆసిడ్ లోపం సంభవించ డానికి మనకు ఆస్కారం లేదు. దీని లోపం వల్ల ముఖ్యంగా గర్భిణులకు, ప్రసవించిన స్త్రీలకు అరికాళ్ళ మంటలు, పోటులు వస్తాయి. లివరు, కిడ్నీ, ఈస్టు, గ్రుడ్డు, తాజా కూరగాయలు మున్నగునవి దీనికి ముఖ్య ఆధారం. ముఖ్యంగా మాంసం, గ్రుడ్డు, పాలసంబంధమైన పదార్థాలలో విట మిను బి$_{12}$ (కొబాలామిన్) అధికంగా లభిస్తుంది. పాలలో కొబాల్టు అధికంగా ఉంటుంది. దీన్నే కొబాలామిన్ అంటారు. దీని లోపంవల్ల శరీరంలో వెన్నుపూస, నాడీవిధానం చెడిపోతుంది. రక్తహీనతకు విటమిను బి$_{12}$ ఇంజక్షన్లు ఇస్తారు. ఈ చికిత్సను అనుసరించడంవల్ల రక్తకణాలు వృద్ధి శీఘ్రంగా జరుగుతుంది. సాధార ణంగా రోగులకు ఫోలిక్ ఆసిడ్‌తోపాటు విటమిను బి$_{12}$ ఇస్తారు.

బయోటిన్ ఉడకబెట్టిన గ్రుడ్లలో మాత్రమే లభిస్తుంది. ఇది లోపిస్తే నాలుక ఎండిపోతుంది. చర్మం మీద పగుళ్ళు ఏర్పడ తాయి. బయోటిన్ ఎక్కువగా లివరు, కిడ్నీ లలో లభిస్తుంది. పప్పులు, బాదం, వేరు శనగ, కొన్ని కాయగూరలలోను బయోటిన్ ఉంటుంది.

వివిధ రకాల ధాన్యాల పొట్టులలో ఇనా సిటాల్ ఉంటుంది. ఎస్కార్బిక్ ఆసిడ్ (విటమిను సి) సులభంగా నీటిలో కరుగు తుంది. కాబట్టి కూరలు పండేటప్పుడు,

---

## రక్తపుపోటు నివారణకు కాల్షియం!

ప్రతిదినం కొద్ది మోతాదులో కాల్షియం (calcium) తీసుకుంటే రక్తపు పోటును నివారించుకోవచ్చని, గర్భధారణ సమ యంలో రక్తపుపోటు, మూర్ఛలతో కూడిన ఎక్లామ్సియా (Eclampsia) నివారణకు కూడా సహకరిస్తుందనీ గాటిమోలా నగ రంలో న్యూట్రిషన్ ఆఫ్ సెంట్రల్ అమెరికా మరియు పనామా సంస్థలో పనిచేసే జోన్ విల్లార్ వ్రాస్తున్నారు.

ఉడకబెట్టేటప్పుడు అతి శీఘ్రంగా ఇది నశించిపోవడానికి అవకాశం ఉంది. తాజా పళ్ళలోను, కాయగూరలలోను ప్రకృతి సిద్ధ



మైన విటమిను 'సి' పుష్కలంగా లభి స్తుంది. ఆహారపదార్థాలను రిఫ్రిజరేటర్‌లలో నిలువ చేయడంవల్ల విటమిను'సి' శీఘ్రంగా నశించదు. ముఖ్యంగా మొలకెత్తిన శనగలు లోను, పెసలలోను విటమిను 'సి' అధి కంగా లభిస్తుంది. ఉసిరికాయ, జామ, బొప్పాయి, నిమ్మజాతి సిట్రస్‌పళ్ళలోను, మునగకూర వంటి ఆకుకూరలలోను కూడా విటమిను 'సి' ఉంటుంది.

18వ శతాబ్దంలో విటమిను 'సి' ప్రాము ఖ్యతను కనుగొన్నారు. ఆ రోజులలో నాలుగు అయిదు మాసాలపాటు సముద్ర ప్రయా ణంలో ఉన్న నావికులకు స్కర్వీరోగం సంభవించేది. నిమ్మజాతి పళ్ళు లేక నిమ్మ రసం ఇచ్చి స్కర్వీని కుదర్చవచ్చని ఒక ఆంగ్లేయ వైద్యుడు కనుగొన్నాడు. స్కర్వీ వల్ల నోటి చిగుళ్ళవెంట రక్తం కారుతుంది. కీళ్ళు వాస్తాయి, దంతాలు కదిలిపోతాయి, చర్మం పగిలి రక్తం స్రవిస్తుంది. శరీ రంలో ఇనుము ధాతువులను సమస్థాయిలో ఉంచడానికి కూడా ఇది సహకరిస్తుంది.

శుభ్రమైన పాలలోను, చేపనూనెలోను, సూర్యరశ్మిలోను కేల్సిఫెరల్(విటమిను'డి') సులభంగా దొరుకుతుంది. మానవశరీరంలో ఈ విటమిను లోపిస్తే సాధారణంగా పిల్ల లలో ఎముకలు వంకరలు పోతాయి, దంతాలు కదిలిపోతాయి. రికెట్స్ రోగం సంభవిస్తుంది. పెద్దవారిలో కూడా ఎముకలకు సంబంధించిన రోగాలు వస్తాయి. రక్తంలో విటమిను 'డి' అధికం అయితే తలనొప్పి, వాంతులు వగైరా బాధలు కలుగుతాయి.

చర్మ సంబంధమైన రోగాలు, పుండ్లు, కామెర్లు వంటి లివరు జబ్బులు, గుండె జబ్బులు, బట్టతలవంటి రోగాలను విటమిను 'ఇ' నిరోధిస్తుంది. ఆకుకూరలు, ఆవుపాలు, శాకా సంబంధమైన నూనెలలో ఇది విస్తా రంగా లభిస్తుంది. విటమిను 'కె' ఆకుకూర లలో లభిస్తుంది. రక్తం శీఘ్రంగా గడ్డ కట్టడానికి ఇది సహకరిస్తుంది.

ఆకుకూరలు వండేటప్పుడు, ఉడకబెట్టే

(మిగతా 58 వ పేజీలో)

## 60 సెకండ్లపాటు తిరిగే ప్రత్యేక 'పల్స్ వాచ్'

1649_1734 సం.ల మధ్య సుప్రసిద్ధ ఆంగ్లేయ వైద్యుడు సర్ జాన్ ఫ్లాయర్ 60 సెకండ్లు తిరిగే ప్రత్యేకమైన నాడీ గడి యారం కల్పించి తన రోగుల నాడీని పరీ క్షించేవాడు. తరువాత ఇతని ఇదే విధానాన్ని నేటి టైం పీసులలో అమర్చారు.

"అనంత విశ్వాత్మలో జీవాత్మలన్నియు అంశములు."

# విజయం ఒక యాత్ర మాత్రమే

వ్యక్తిగత జీవితంలో విజయం ఒక అతి సరసమైన సంఘటన. ప్రతీ మానవుడు విజయం పొందాలనే ఆశిస్తాడు. అపజయం ఒక విధమైన మరణంగా భావిస్తాడు. సుమ



సౌరభంతో మనోరంజకమై సుశ్రావ్యంగా వినిపించే విజయం అనే తీయని పదం ప్రతీ మానవునికి జీవితంలో సంతృప్తికరమైన సంసిద్ధిని చేకూరుస్తుంది. విజయతత్త్వం గురించి వ్రాస్తూ మైకేల్ కోర్డా "మనుగడలో సకల సద్గుణాలు, సంతోషాలు 'విజయం' అనే ఒక పదంలో కలసి ఉన్నాయి" అని అంటాడు. కాని ఇది పూర్తిగా ప్రాపంచిక సంబంధమైన ఐహిక భావంతో ఇమిడి ఉంది. ఆస్తిని సంపాదించడం విజయం కాదు. ధనాన్ని కూడబెట్టడం విజయం కాదు. విజయానికి కొలబద్ధ ధనం కాకూడదు. ఇతరులలో మంచిని గ్రహించి తనలో ఉన్న మంచిని విభజించుకున్న నాడే వ్యక్తి విజయవంతుడు.

సామాన్యమైన అర్థం చెప్పుకోవాలంటే లక్ష్యాన్ని సాధించడమే విజయం. దీని వల్ల మన వాస్తవిక అస్తిత్వానికి అర్థవంతమైన వ్యాఖ్యానం చెప్పి మన ఉత్తమ సామర్థ్యాలను ప్రస్ఫుటం చేయబడతాయి.

విజయం అనేది సాపేక్షికం. ఇది వివిధ వ్యక్తులకు వివిధంగా ఉంటుంది. కొందరు నెలకు రూ. 5000/- లు సంపాదిస్తే అది విజయం అనుకుంటారు. డాక్టరు పరీక్షలో గానీ, ఇంజనీరింగ్ పరీక్షలో గానీ ఉత్తీర్ణతను పొందడం విజయంగా భావిస్తారు కొందరు.

## విస్డమ్ పాతకాపీలు

ఫిబ్రవరి '83, మార్చి '83; ఫిబ్రవరి '84 నుంచీ జూన్'84; ఆగస్టు '84 నుంచీ డిసెంబరు '84; జనవరి '85 నుంచీ డిసెంబరు '85 కాపీలు మావద్ద ఉన్నవి. 1983 కాపీల వెల రూ. 1-75 లు; 1984 కాపీలవెల రూ. 12-00 లు; 1985 కాపీల వెల రూ. 14-75 లు. రిజిస్టర్ట్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 2-75 చేర్చి M O పంపాలి. 'విస్డమ్' 9, దేశికారోడ్డు, మద్రాసు-600004.

—సర్క్యులేషన్ మేనేజర్.

"నీతిశాస్త్రమే యోగమునకు పునాది."

'అర్జున్' బిరుదుని సంపాదించడం ఘన విజయం అనుకుంటారు కొందరు. లక్షాధి కారి కోటీశ్వరుడు అవాలని దీనికి అర్థం కాదు. విజయవంతమైన వ్యాపారస్థుడు కావచ్చు. రాజ్యపాలకుడుగా విజయవంతుడు కావచ్చు. ఒక సాంకేతిక నిపుణుడుగా విజయ వంతుడు కావచ్చు. విశ్వవ్యాప్తంగా అందరి అభిలాష "విజయం" అయినప్పటికీ ఏ కొద్ది మందో విజయానికి తగిన మనోనిశ్చయంతో తమనుతాము అభివృద్ధి చేసుకోడానికి ప్రయ త్నిస్తారు. అనేకమంది అధ్యయనం చేయ వచ్చు. వినవచ్చు. అనుమతించ వచ్చు, అంగీకరిచవచ్చు. కాని ఏ కొద్దిమంది మాత్రమే ఉద్యమించి విజయం సాధిస్తారు. మన అందరికీ విజయం పొందాలని తగిన కోరిక ఉండవచ్చుగానీ మనో నిశ్చయం ఉండదు. అపజయాన్ని పొందారంటే వారికి శక్తి సామర్థ్యాలు లేవని కాదు. పట్టుదల, మనోనిశ్చయం ఉండాలి. విజయానికి ఈ రెండు ముఖ్యంగా ఉండి తీరవలసినవి.

విజయం అనేది నైపుణ్యతలాగ ఒక స్థిర బిందువు వంటిది కాదు. ఇది ఒక నిరంతర పరమావధి లేని ప్రయాణం లాంటిది. ఒక ధ్యేయాన్ని లేక లక్ష్యాన్ని పొందిన తరువాత మరో లక్ష్యాన్ని ఏర్పరచుకుని దాన్ని సాధించ డానికి ప్రయత్నిస్తారు. ఇది నిర్విరామంగా కొనసాగే ఉద్యమం.

"సోదరులారా! లేవండి, మేల్కొనండి ఎంతకాలం ఈ నిద్ర" అంటూ స్వామి వివేకా నందుడు కృతనిశ్చయం, మనోభీష్టంయొక్క ప్రాముఖ్యతను వివరిస్తాడు. దీనినే జీవిత పరమావధిగా గ్రహించాలి. ఇదే విజయానికి మార్గం.

('రవీంద్రభారతి' సౌజన్యంతో)

## తేడాలను తెలుసుకోండి







ఈ రెండు చిత్రాలు పైకి ఒకే విధంగా కనిపించినా రెండవదానిలో మొదటి దానిలో కంటే ఆరు తేడాలు ఉన్నాయి. చెప్పండిమరి.

---

"ప్రాణాలు అనే గడియారాలకు ప్రారబ్ధం అనే కీ ఇచ్చి విడిచిపెట్టాడు భగవంతుడు. కీ అయిపోగానే అవి ఆగిపోతాయి."

# సినీ ప్రపంచం

### భారతదేశంలో సినిమా తీసిన తొలి భారతీయుడు:

హరిశ్చంద్ర భట్వాడెకెర్ అనే సవదాదా అను నతడు భారతదేశంలో సినీమాను



తయారుచేసిన తొలి భారతీయుడు. ఇతడు 1899 వ సం. లో 'ది రెస్లెర్స్' (The wrestlers), మానవుడు_కోతి(Man and Monkey) అనే రెండు ఛాయాచిత్రాలను తీసి ప్రదర్శించాడు.

* * *

### భారతదేశపు మొట్టమొదటి థియేటరు:

సినీమా థియేటర్లకు ఆద్యుడని చెప్ప తగిన జె. ఎఫ్. మదన్ 1907 వ సం. లో కలకత్తాలో తొలిసినీమా హౌస్ నిర్మించాడు.

* * *

### తొలి భారతీయ ఫీచర్ ఫిల్మ్:

పుండరీక్ మొట్టమొదటి భారతీయ ఫీచర్ ఫిల్మ్. మహాభారతంలో పుండరీక మహా ముని ఆధారంగా ఆర్.జి. టార్నే. ఎన్.సి. చిత్ర అనేవారు దీనిని తయారుచేసారు. మే 18, 1912 వ తేదీన బొంబాయిలో కార్పొరేషన్ సినీమాటోగ్రాఫ్‌లో విడుదల కాబడింది. ఈ చిత్రానికి జాన్‌సన్ అనే ఆంగ్లేయ కెమేరామేన్ ఛాయాచిత్రాలను తీసాడు.

* * *

### భారతదేశంలో తయారైన మొదటి సైలెంట్ చిత్రం:

భారతదేశంలో తయారైన ప్రప్రథమ మూకీచిత్రం (Silent) రాజా హరిశ్చంద్ర మే 3, 1913న దాదాసాహేబ్ ఫాల్కేచే విడుదల చేయబడింది. ఇది అచ్చంగా నూటికి నూరుపాళ్ళు భారతీయులు తీసిన చిత్రం.

"సహజీవనం, సోదర భావం
శాంతియుత జీవనానికి ఆధారం."
—ఇందుకూరి హేమనళిని, హైదరాబాద్.

* * *

" 'జీవితం' ఒక మందార పుష్పం
'ప్రేమ' అందులోని మకరందం."
—పాటూరి హరిప్రసాద్, ముదిగోళం,
(చిత్తూరు జిల్లా)

"ఆత్మ జ్ఞానము పొందినప్పుడు మాయ అదృశ్యమగును."

**57 వారాలు ఆడిన మొదటి భారతీయ చిత్రం:**



హిందీ 'తుకారామ్' అనేక వారాలపాటు ఆడిన మొదటి భారతీయ చిత్రం. 1937 లో విడుదల కాబడి 57 వారాలు ఆడింది.

* * *

**అంతర్జాతీయ సినీమా ఉత్సవంలో ఉత్తమ చిత్రంగా ఎన్నుకోబడిన తొలిభారతీయ చిత్రం:**

అంతర్జాతీయ ఫిల్మోత్సవంలో ఉత్తమమైన చిత్రంగా ఎన్నుకోబడిన మొదటి భారతీయ చిత్రం 1937 వ సం. లో తొలిసారి ప్రదర్శింపబడిన హిందీ 'తుకారామ్'.

* * *

**దక్షిణాదిని మొట్టమొదటి ఫిల్మ్ స్టూడియో:**

తమిళనాడు సేలంలో మోడరన్ థియేటర్స్ దక్షిణ భారతదేశంలోని మొట్టమొదటి ఫిల్మ్ స్టూడియో.

* * *

**భారతదేశంలో తయారైన మొట్టమొదటి టాకీ:**

1931వ సం.లో బొంబాయి ఇంపీరియల్ ఫిల్మ్ స్టూడియోలో ఖాన్‌బహదూర్ అర్దషీర్ ఇరానీ తీసిన ఆలం ఆరా భారతదేశపు తొలి టాకీచిత్రం. ఇది హిందూస్థానీలో ఉంది.

* * *

**మద్రాసులో తీసిన మొదటి చిత్రం:**

పౌరాణిక కథ 'కీచకవధమ్' అనే చిత్రం 1919లో మద్రాసులో తీయబడిన మొదటి చిత్రం.

* * *

**మొట్టమొదటి భారతీయ వ్యంగ్య (Cartoon) చిత్రం:**

మొట్టమొదటి భారతీయ వ్యంగ్య చిత్రం 'బాబు' అనే చిత్రం.

* * *

**భారతదేశపు మొట్టమొదటి వర్ణచిత్రం:**

1938వ సం.లో హిందీలో తయారైన 'కిసాన్ కన్య' భారతదేశపు తొలివర్ణచిత్రం.

* * *

**మొదటి దక్షిణాది మహిళా డైరెక్టరు:**

మొట్టమొదటి దక్షిణాది మహిళాడైరెక్టరు టి.పి. రాజలక్ష్మి. 'కమల' అనే వీరి చిత్రం 1937 వ సం. లో తయారైంది.

"భవరోగ నివారణకు దివ్యౌషధాలు రెండు—
భగవన్నామ శ్రవణము, కీర్తనము."

# నీ కాళ్లమీద నీవు నిలబడాలి

ఇతరుల ఆశ్రయం ఆశించకు. ఇతరుల ఆశ్రయంతో ఎప్పటికీ ప్రవృద్ధిని పొందలేవు. శీలాన్ని తీర్చిదిద్దుకునే తరుణంలో పరాశ్రయం వంటి మహోపద్రవం మరోటి లేదు. జీవితం ఊతకర్రలతో ప్రారంభిస్తే



జీవితాంతం ఊతకర్రల సహాయం అపేక్షిస్తావు. ఇతరుల సహాయంకోసం ప్రాధేయపడటం బుద్ధి స్వాతంత్ర్యాన్ని నాశనం చేసుకోడమే. నిన్ను నీవు తెలుసుకోడానికి ప్రయత్నించు. నీకు కావలసిన సహాయం, శక్తి నీలోనే ఉన్నాయి. అవి నీలో నుంచే పైకి ఉబికి రావాలి. నీకు అవసరమైన ఆత్మవిశ్వాసం నీలోనే ఉంది. నీలో నిత్యజ్యోతిగా ప్రకాశించే ఆత్మవిశ్వాసమే నీకు మార్గాన్ని చూపుతుంది.

మహోన్నతమైన పర్వత శిఖరాలను కూడా పడగొట్టే పెద్ద పెద్ద తుపానులలో చెక్కుచెదరని చెట్లు లేవూ? కేవలం స్వార్జితమైన సామర్థ్యం, స్వబుద్ధి, సంకల్ప బలం ఉండబట్టే ఎందరెందరో ఎన్నెన్నో మహాద్భుతాలను సాధించగలుగుతున్నారు; ఉన్నత పదవులను అధిష్ఠించగలుగుతున్నారు. అపార ధనాన్ని సంపాదించగలుగుతున్నారు. క్రోయిసస్ మొదలు ఫోర్డ్‌దాకా అందరిదీ ఒకటే కథ. ఎవరికి వారు స్వాతంత్ర్యంగా ఉద్యమించిన వారే. ఆత్మవిశ్వాసంతో జీవితంలో అఖండ విజయాలు సాధించారు.

ఇతరుల సహాయంకోసం ఆరాటపడటం మానుకో. ఎవరో ఇస్తారని, ఎవరో సహాయపడతారని అనుకోడంవల్ల ప్రయోజనం శూన్యం. ఇది కేవలం బుద్ధి స్వాతంత్ర్యాన్ని నాశనం చేసుకునే శ్రమ, వృథా శ్రమ.

ఎవరి సంగతి వారే చూసుకోవాలి. ఎవరిని వారే సంస్కరించుకోవాలి. నీ స్వతంత్రమైన భావాలు నీకున్నాయి. నీ ప్రత్యేక జీవిత విధానాలు నీకున్నాయి వీటిని నిర్భయంగా ధైర్యంతో నీవు అనుసరించు. నీ స్వబుద్ధే నీకు దీపం. నీవు ఉపవాసమున్నా, పండుగ చేసుకున్నా నీ కృషిమీదే ఆధారపడి ఉంటుంది. ఆత్మవిశ్వాసంతో నిరంతర కృషి సాగించి సాధించలేనిదేముంది? నిన్ను నీవు సంస్కరించుకోవాలి. ఇంకొకరు నిన్ను సంస్కరిస్తారనుకోడం వట్టి మాట. ఇతరుల

(మిగతా 15 వ పేజీలో)

"మతము, జీవితము రెండు కావు, అవి రెండూ ఒకటే."

# ఫోటానులవేగం 3,00,000 కి.మీలు

డా. అనిల్ అగర్‌వాల్

ఇది జెట్ యుగం. ఈ యుగంలో ఎవరికివారే ఒకరికంటె ఒకరు ముందు - శీఘ్రంగా వెళ్ళాలనుకుంటారు. తన ఆఫీసుకు



ఆలస్యం లేకుండా చేరాలనుకునే సాధారణ ఉద్యోగి దగ్గర నుంచి ఇతర గ్రహాలను పరిశోధించేందుకు ప్రయాణించే నేటి అంతరిక్ష శాస్త్రజ్ఞు దాకా అందరూ వేగంతో పోటీపడి ప్రయాణం చేసేవారే. మనకి అతి చేరువగా కనిపించే ప్రాక్సిమా సెంటారి (proxima centauri) అనే నక్షత్రం 4.25 కాంతి సంవత్సరాల దూరంలో ఉంది - అంటే 25 ట్రిలియన్ మైళ్ళ దూరం. ఇప్పుడు మనకు సాధ్యమయే సెకండుకు 11 కి.మీ. వేగంతో ఈ ప్రపంచాలకు ప్రయాణం కడితే అక్కడికి చేరడానికి మిలియన్ల కొద్ది సంవత్సరాలు పడుతుంది. అంతరిక్ష నావికుల తరాలు ఎన్ని తరాలు దాటిపోవాలో! ఇది ఏదో సాధ్యంకాని పని, కేవలం ఊహ మాత్రమే. గ్రహాంతర ప్రయాణాలు చేపట్టాలంటే దీని కంటే ఉత్తమమైన మరో మార్గం వెతుక్కోవాలి. ఇదే ఆంటీమేటరు (anti matter). ద్రవ్యం (matter) అద్రవ్యం (antimatter) అతి సన్నిహితమైనప్పుడు శబ్దాతీతమైన అధిక వేగపు కణాలు, బ్రహ్మాండమైన శక్తి వెలువడుతాయి.

ఇవే ఫోటానులు. ఫోటానులు మిక్కిలి వేగంతో ప్రయాణం చేస్తాయి. వీటి వేగం సెకండుకు 3,00,000 కి.మీ! ఈ వేగాన్ని మనం వినియోగం చేసుకోడం ఎలా? ఒక తుపాకి బ్యారెల్‌లో నుంచి ఫోటానులు

---

## క్రొత్త పుట్టుకలకు ప్రపంచ రికార్డు

బ్రెజీలు ముఖ్యపట్టణం బ్రెసీలియా పొలిమేరల ఉన్న పెయిలాండియా అనే చిన్న ఊరిలో సాలుసరి పుట్టుక రేటు 6.2 శాతం. క్రొత్తగా జన్మించే పసిబిడ్డలకు ఇదే ప్రపంచ రికార్డు. ఈ విపరీత జననాలకు ముఖ్య కారణం మగతనాన్ని ప్రదర్శించుకోవాలనే మగవారి అభిలాష, మహిళల గర్భనిరోధక చర్యల అజ్ఞానం.

'కష్టాలు కళ్ళెదుట కనిపించే ఎత్తయిన కొండల్లా ఉంటాయి. ఎక్కిన కొద్దీ అవి సరళరేఖ లవుతాయి." —కాక్స్

వదలబడ్డాయని అనుకోండి. గుండు పేల్చ బడ్డప్పుడు రీకోయిల్ (recoil) ఏర్పడు తుంది. ఒక ముఖ్య న్యూటన్ సిద్ధాంతం ప్రకారం ఈ రీకోయిల్ బారల్‌లో నుంచి వెలికిపోయే గుండువేగానికి సమంగా



నక్షత్ర పుంత

ఉంటుంది. ఇక్కడ గుండ్లకు మారుగా ఫోటానులుంటాయి. మనకు సుమారు ఫోటానుల వేగానికి సమానమైన సెకండుకి 3,00,000 కి.మీ. లు రీకోయిల్ (recoil) సంభవిస్తుంది. అంతరిక్ష నావికులు కూర్చున్న అంతరిక్ష నౌకని రాకెట్‌పైన ఉంచుతారు. దీనికి రెండు చేంబరులు ఉంటాయి. ఒకదాంట్లో ద్రవ్యం, మరో దాంట్లో అద్రవ్యం ఉంటాయి.

ఈ రెండు చేంబర్‌లో మిళితం చేయబడతాయి. వీటిమధ్య స్పర్శ ఏర్పడీ ఏర్పడటంతో బ్రహ్మాండమైన వేగంతో మిలియన్లకొద్దీ ఫోటానులు విడుదల అవు తాయి. ఈ ఫోటానులు నాజిల్ గొట్టంలో నుంచి క్రిందికి నెట్టబడతాయి. దీని ఫలి తంగా రాకెట్ పైకి నెట్టబడి ఊహించ లేని మహావేగంతో ఆకాశంలోకి తోసుకు పోతుంది!

ఈ వేగంతో మనకు దగ్గరగా ఉండే నక్షత్రాన్ని దగ్గర దగ్గర 4½ సంవత్స రాలలో చేరగలమేమో? దగ్గరగా ఉన్న నక్షత్రవీధి (గాలక్సీ) - ఆంద్రోమెడా చేరా లంటే? ఈ వేగంతో దగ్గరి గాలక్సీని చేర డానికి మిలియన్ల కొద్ది సంవత్సరాలు పడు తుంది. 25 గాలక్సీల గుంపు చేరడానికి అనేకవందల మిలియన్ల సంవత్సరాలు పడు తుంది. ఈ వేగంతో ఇక ఇతర నక్షత్రాలను గురించి మన యోచన అనవసరం.

అయితే మనం ఏం చేయాలి? ఇంతకంటే అధికమైన వేగాలలో పయనించాలంటే ఐన్‌స్టైన్ ఇది అసంభవం అని అంటాడు. కాబట్టి ఇటువంటి ప్రయాణాలకు క్రొత్తగా హైపర్ స్పేస్ (అతిశయించిన అంత రిక్షం)లో ప్రయాణాలు సాగించాలి. ఇది ప్రయాణంలో ఒక నవ్యకల్పన, క్రొత్త అనుభవం.

(13 వ పేజీ తరువాయి)

సహాయం అభ్యాసం చేసుకుంటే నీవు వంచకుడై పోతున్నావు. నీ స్వాతంత్ర్యం కోల్పోతున్నావు. నీ ఉద్యమాలు కుంటుపడు తున్నాయి.

నీ మనస్సును నీవు నిర్ణయం చేసు కుంటే నీవెంతో బలవంతుడవు అవుతావు. జీవితంలో విజయం సాధించాలంటే ఆత్మ విశ్వాసం పెంపొందించుకో.

"మాయయే మన బుద్ధిని మార్చి భ్రమ కలుగచేయు చున్నది."

# 'ఎయిడ్స్' అంటే

చార్మియన్ ఫెర్నాండెజ్

'ఎయిడ్స్' (AIDS) ఎక్వైర్డ్ ఇమ్యూనిటీ డెఫిషియెన్సీ సిన్‌డ్రోమ్ అనేది కొత్తగా ప్రపంచంలో కొన్ని దేశాలలో వ్యాపిస్తున్న



భయంకరమైన వ్యాధి. ముఖ్యంగా అమెరికాలో, ఆఫ్రికాలో కొన్ని భాగాలలో, పసిఫిక్ సముద్ర ద్వీపాలలోను ఈ వ్యాధి బాగా పాకిపోయింది. మందులేని భయంకరమైన ఈ నూతన మారకవ్యాధికి ప్రపంచం గజగజలాడి పోతూంది.

శరీరంలో ముఖ్యమైన వ్యాధి నిరోధక శక్తి అనే ప్రత్యేక ఇమ్యూన్ విధానం (immune system) ఉంది. శరీరంలో ఈ ఇమ్యూన్ విధానంవల్లనే సహజంగా రోగాన్ని నిరోధిస్తూ కోలుకొనే శక్తి లభిస్తుంది. ఏదైనా రోగం సంభవించినప్పుడు, ప్రమాదం జరిగినప్పుడు, శరీరం మంటలో కాలినప్పుడు ఇమ్యూన్ విధానం వల్లనే సహజ నిరోధకశక్తి ఏర్పడి రోగి కోలుకోడం జరుగుతుంది. శరీరంలో ఈ సహజమైన నిరోధక శక్తి పూర్తిగా నశించి పోయినప్పుడు రోగికి రోగ విముక్తి అసలు ఉండదు. ఎటువంటి చిన్నరోగం వచ్చినాసరే సాధారణమైన జలుబైనా సరే రోగిమరణిస్తాడు.

'ఎయిడ్స్' మొట్టమొదట 1981 వ సం॥ లో కనుగొనబడింది. గత 4 సంవత్సరాలలో 6,000 మంది దీనితో మరణించారు. ఇంకో 6,000 మంది ఈ రోగంతో మరణించడానికి సిద్ధంగా ఉన్నారు. ఈ రోగం పట్టుకున్న వాళ్లు ఇక బ్రతుకుతారనే ఆశ లేదు.

'ఎయిడ్స్' రోగం ఉన్న పిల్లలను ఏ స్కూలులోను చేర్చుకోరు. 'ఎయిడ్స్' నోటి ద్వారా సంక్రమిస్తుందనే భయంచేత అమెరికాలో అగ్నిమాపకదళానికి సంబంధించిన ఫైర్‌మెన్ అవసరమైనప్పుడు నోటిలో నోరు పెట్టి కృత్రిమ శ్వాసను కలిగించడానికి సమ్మతించడంలేదట. ఎవరైనా ఈ రోగంతో

(మిగతా 52 వ పేజీలో)

"భగవంతుడు ఏది చేసినా మన మేలుకొరకే చేస్తాడు అనే భావన జీర్ణించినవానిని ఎట్టి క్లిష్టపరిస్థితులైనా కలతపెట్టలేవు."

# పుష్టికి రకరకాలపళ్లు

పోషక పదార్థాలలో ప్రకృతి ప్రసాదించే పళ్ళు ప్రధానమైనవి. ఇవి మంచి ఆరోగ్య దాయకాలు; సర్వరోగ నిరోధకాలు. మానవ శరీరాభివృద్ధికి తప్పనిసరిగా కావలసిన పోషక



పదార్థాలను యుక్తమైన పాళ్ళలో పుష్కలంగా లభింపజేస్తాయి. శరీర పోషణకు అవసరమైన వివిధ ధాతువులకు, రకరకాల విటమినులకు, ఎంజైములకు ఇవే ఆధారం. ఇవి అతి సుళువుగా జీర్ణమై శరీరంలో రక్త ప్రవాహాన్ని, జీర్ణకోశాన్ని శుభ్రపరుస్తాయి. శరీరంలో ఏర్పడే అనేక రుగ్మతలను పండ్లతోనే అమోఘంగా నివారించుకోవచ్చు.

మానవ శారీరక వ్యవస్థకు పళ్ళు-ఫలాలు ఎంతో లాభాన్ని కలిగిస్తాయి. ముఖ్యంగా దేహంలో వీటి ప్రభావం అనేక విధాలుగా ఉంటుంది.

1. నీటి కొరతను తీర్చునవి: పళ్ళు దేహవ్యవస్థకు కావలసిన నీటిని అతి సరళంగా లభింపజేస్తాయి. రోగులకు పండ్ల రసాల మూలంగా ఒకే సమంగా చక్కెర, ఖనిజాలు లభించే అవకాశం ఉంది.

2. మూత్ర వర్ధకాలు: అధికంగా పళ్ళు, పళ్ళరసాలు ఉపయోగించినప్పుడు మూత్ర విసర్జన ఎక్కువగా జరుగుతుంది. మూత్రము యొక్క సాంద్రత తగ్గుతుంది. నత్రజని సంబంధమైన వ్యర్థ పదార్థాలు మరియు క్లోరైడుల విసర్జనం అతి త్వరితంగా జరుగుతుంది.

3. క్షారీకరణము (ఆల్కలైజింగ్): పళ్ళలో గల లవణాలు, కార్బనిక అమ్లముల వలన శరీరంలో క్షార సంబంధమైన కార్బొనేటులు ఏర్పడి వివిధ ద్రవాలను క్షారవంతం చేస్తాయి. అన్నిరకాల పళ్ళు ప్రేగులను పరిశుభ్రం చేస్తాయి. దీనివలన వ్యర్థములైన విషపదార్థాలు రక్తంలో చేరడానికి ఏమాత్రం

## 'తృష్ణ' నిత్యయౌవ్వనం

ఏళ్ళు గడుస్తున్నకొద్దీ తలమీద వెంట్రుకలు పండిపోతాయి. నోటిలో పళ్ళు కదిలిపోతాయి. చూపు మందగిస్తుంది. చెవులు వినిపించవు. వయస్సు ముందుకు పోతూన్నకొద్దీ ఒక్కటే ఒకటి నిత్యయౌవనంతో నవనవలాడుతూంటుంది.... 'ఆశా' కన్య.

—పంచతంత్రం

"ధనము చేతకాదు, సంతతి చేతకాదు
త్యాగముచేతనే కొందరు అమృతత్వము పొందిరి."

అవకాశం ఉండదు.

4. ధాతువులు: దేహ ఆరోగ్యానికి అవశ్యకమైన ఖనిజపదార్థాలను పళ్ళు కలిగి స్తాయి. ఆప్రికాట్ ద్రాక్ష, ఖర్జూరము వంటి ఎండు పళ్ళలో సున్నము, ఇనుము పుష్కలంగా లభిస్తుంది. వీటియందు లభించే ఖనిజాలు శరీరంలో ఎముకల దృఢనిర్మాణానికి, శుద్ధమైన రక్త ప్రవాహానికి ఎక్కువగా తోడ్పడతాయి.

5. రేచనకారి: సాధారణంగా పళ్ళలో లభించే సెల్యులోజ్ వంటి పీచు పదార్థం మనం తినే ఇతర ఆహార పదార్థాలనుజీర్ణ కోశం గుండా సులభంగా ప్రవహింప జేయ డానికి సహకరిస్తుంది. పళ్ళలో ఉండే రక రకాల చక్కెరలకు, కార్బనిక ఆమ్లములకు అపూర్వమైన విరేచనశక్తి ఉంది.

6. అమృతం వంటి టానిక్: పళ్ళలో విటమినులు పుష్కలంగా ఉంటాయి. జామ, టొమాటో, సీతాఫలం, కమలా, బత్తాయి వంటి సిట్రస్ పళ్ళు ముఖ్యంగా అమూల్యమైన 'సి' విటమినుకు ముఖ్య ఆధారాలు. అనేక పళ్ళలో కెరోటీన్ (Carotene) అమితంగా ఉంటుంది. ఇది శరీరంలో విటమిను 'A' గా పరిణామం చెందుతుంది.

బాగా పండిన పళ్ళు తినడం ఎక్కువ ఆరోగ్యకరం. వీటిని ఉడకపెట్టడం వల్ల వీటియందుండే పోషక పదార్థాలు, కార్బొహైడ్రేటులు పూర్తిగా నశించి పోతాయి. వీటిని ముఖ్యంగా పొద్దుటిపూట ఆహారంగా సేవించడం ఉత్తమం. ఒకేసారి రెండు మూడు రకాల పండ్లను తినడం కంటే ఒకే రకం పళ్ళను తినడం మంచిది. ఆరోగ్యవంతంగా ఉండాలంటే ప్రతీ రోజూ ఆహారంలో అధమం ఒక పౌండు తూకం గల తాజాపళ్ళు తినాలి. అనారోగ్య పరిస్థితులలో పళ్ళను రసాలుగా తయారుచేసి త్రాగటం మంచిది. రసం తీసిన వెంటనే త్రాగాలి. పండ్ల రసాలను నిలువచేస్తే అవి హానికరమైన పదార్థాలుగా తయారవుతాయి.

చికిత్సకు ఫల వైద్యం: శరీరంలో ఆమ్ల క్షారముల సమతూకాన్ని అతి సరళంగా

## అపూర్వ వాద్య విశేషం



బెంగళూరు వాస్తవ్యులైన శ్రీ ఎల్. నరసింహారావు కల్పించిన 'త్రివేణి వీణ'ను వీణ, గోట్టు వాద్యం, తంబూరాలుగా దేని కదే విడివిడిగా మార్చుకొని అమర్చుకోవచ్చు. దీన్ని అతి సులభంగా విడగొట్టి తిరిగి దేనికది అమర్చుకోవచ్చు. ఒకదాని నుండి మరొకదానికి క్షణంలో మార్చుకోవచ్చు. దీని వెల రూ. 5,000.

"అంతఃకరణమును శుద్ధి చేయు
విద్యయే విద్య; మిగిలినదంతయు అవిద్య."

నిర్వహించడానికి పళ్ళు ఎంతో సహక రిస్తాయి. అధిక ఆమ్ల జనక ఆహారపదార్థా లను అమితంగా తినడంవల్ల ఏర్పడే దోషా లను తటస్థపంతం చేసి కావలసిన క్షారతను పునః ప్రతిపాదిస్తాయి. అపాయకరమైన వ్యర్థ పదార్థాలను తొలగించుటకు సహకరించి, సహజమైన చక్కెరను, విటమినులను, ధాతువులను కలిగిస్తాయి.

చికిత్సా విధానంలో అతి ప్రాచీన కాలం నుంచీ ఉపవాసం ఒక సాధనగా ఆచరింప బడుతూంది. పళ్ళతో ఉపవాసం (జ్యూస్ ఫాస్టింగ్) ఉత్తమమైన మరియు నిరపాయకర మైన ఉపవాస విధానం. ఉదయం 8 గంటల మొదలు రాత్రి 8 గంటలవరకు ప్రతి రెండు గంటలకు ఒకసారి గ్లాసెడు వెచ్చని నీటిలో ఒక బత్తాయి పండురసం త్రాగాలి. ఏ రకమైన ఇతర ఆహార పదార్థాలు దీనితో తినకూడదు.

జఠరకోశ శుద్ధికి ప్రకృతి ప్రసాదించిన వివిధ పళ్ళ ఆహారం all fruit diet ఒక దివ్యసాధన. రోజుకు మూడుపూటలు బాగా పండిన ఆపిల్, పియర్, ద్రాక్ష, ఆరెంజి, అనాస, పీచ్, తర్బూజా వంటి రసవంతమైన తాజా పళ్ళు మాత్రమే తింటూ ఆహార నియ మాన్ని పాటించాలి. అరటిపళ్ళు గాని, ఇతర ఆహార పదార్థాలను కాని తినకూడదు.

కొన్ని కొన్ని పళ్ళు ప్రత్యేక రోగ నిరోధకాలు. అజీర్ణములకు, కీళ్ళ నొప్పులకు లివరు సంబంధమైన రోగాలకు, గుండె జబ్బులకు నిమ్మ మంచి ఔషదం. నరాల శక్తిని అధికం చేసుకోడానికి ఇనుము, భాస్వరం, సోడియం వంటి ధాతువులు అధి కంగా ఉండే బెర్రీపళ్ళు ఉత్తమమైనవి. మూత్రకోశములు శుభ్రపరచుటకు పుచ్చ కాయలు ఉపయోగపడతాయి.

ముఖ్యంగా జలుబు, రొంప వంటి రోగా లకు, వివిధ రకాల జ్వరాలకు, శ్వాస సంబంధమైన రోగాలకు అనాసపండు, దానిమ్మ పండు దివ్యఔషధం. సాధారణ జలుబులు ద్రాక్షరసంతో కుదుర్చుకోవచ్చు. మెదడుకు సంబంధించిన అనేక రోగాలకు బాగా పండిన ద్రాక్ష, ఆపిల్, అరటి, అత్తి నివారణను కలిగిస్తాయి. ఈ పండ్లలో సుల భంగా జీర్ణమయ్యే చక్కెర ఉంటుంది. కాబట్టి ఇది శరీరానికి కావలసిన శక్తిగా పరిణమించి బలాన్ని ఇస్తుంది. మనో దౌర్బల్యానికి అక్రూటు (వాల్‌నట్) పప్పు ఉత్తమమైనది.

అధికంగా రకరకాల పళ్ళను ఆహారంగా తినడంవల్ల ఆరోగ్యాభివృద్ధితో మానవుడు దీర్ఘకాలం జీవించగలుగుతున్నాడు. పళ్ళు అన్ని రోగాలను నిరోధిస్తాయి. ఇవి జీవి తాంతం ఉత్తేజాన్ని కలిగించి, శక్తి సామ ర్థ్యాలను అధికపరచి, చురుకుదనాన్ని ఉత్సా హాన్ని కలిగిస్తాయి.

---

## బైబిల్‌ను పూర్తిగా మూడు మాసాలలో కంఠస్థం చేసిన ఆర్చిబిషప్

కాంటర్‌బరీ ఆర్చిబిషప్ థామస్ క్రాన్మెర్ 1489-1556 సం॥లో పవిత్ర గ్రంథం బైబిలును మూడే మూడు మాసాలలో పూర్తిగా కంఠస్థం చేసాడు.

"ఆత్మార్పణతో కూడిన భక్తిమార్గమే మానవుని కెంతయు సహజము."

# మీకు తెలుసా?

**ఆమ్నివోరస్:**

ఆమ్నివోరస్ అంటే అన్నిరకాల ఆహారాలను తినునట్టివి.

*

**సీ ఆఫ్ సెరినిటీ మరియు ఓషన్ ఆఫ్ స్టారమ్స్:**

సీ ఆఫ్ సెరినిటీ మరియు ఓషన్ ఆఫ్ స్టారమ్స్ చంద్రమండలంలో ఉన్నాయి.

* * *

**ఓస్టియోపత్ (Osteopath) ఎవరు?:**

శరీరంలో ఎముకలను నైపుణ్యంగా చేతితో సరిచేసి దెబ్బలకు, గాయాలకు చికిత్స చేయువాడు.

* * *

**మొట్టమొదటి అండర్‌గ్రౌండ్ రైల్వే లండన్ నగరంలో:**

ఇంగ్లండుకు ముఖ్యపట్టణమైన లండన్ నగరంలో మొట్టమొదట అండర్‌గ్రౌండ్ రైల్వే ఏర్పరచారు.

* * *

**మై ఫెయిర్ లేడీ:**

జార్జి బెర్నార్డ్‌షా రచించిన 'పిగ్‌మాలియన్' (Pygmalion) ఆధారంగా తీసిన చిత్రం 'మైఫెయిర్ లేడీ'.

**ఫ్రెడ్ పెర్రీ ఘనవిజయాలు:**

వరుసగా మూడు సంవత్సరాలు వింబుల్డన్ టెన్నిస్ పందాలలో మెన్స్‌సింగిల్స్‌లో విజయం పొందిన ప్రప్రథముడు ఫ్రెడ్‌పెర్రీ.

* * *

**అమెరికాలో మిక్కిలి పెద్ద రాష్ట్రం:**

అమెరికాలో మిక్కిలి పెద్ద రాష్ట్రం అలాస్కా.

* * *

## 7వ లోక్‌సభ సభ్యులలో చాలామంది పట్టభద్రులే



జనవరి 20, 1985 లో కాలపరిమితి అంతమైన 7వ లోక్‌సభలో 542 సభ్యులున్నారు. దీంట్లో టెక్నికల్ అర్హతలు కలవారితోపాటు గ్రాడ్యుయేట్లు, పోస్టుగ్రాడ్యుయేట్లు చాలామంది ఉన్నారు. లోక్‌సభలో అధికశాతం మెట్రిక్యులేట్లు. హైయర్ సెకండరీ మరియు ఇంటర్మీడియేటు సర్టిఫికేటను పొందినవారే.

"ఒరులేమి చేయవలయునని కోరుదువో
దానిని స్వయముగా నీవును చేయుము."

### పీటుస్ట్రీటు మరియు వార్తాపత్రికలు:



లండన్‌లో ఫ్లీటుస్ట్రీటు వార్తాపత్రికలకు ప్రసిద్ధి పొందింది.

* * *

### ఎస్ ఎల్ ఆర్ (SLR) అంటే:

ప్రపంచం అంతా మిలియన్లకొద్దీ SLR కెమేరాలు ఉన్నాయి. ఎస్.ఎల్.ఆర్. అంటే సింగిల్ లెన్స్ రిఫ్లెక్స్.

* * *

### 4 మోకాళ్ళ జంతువు ఒక్కటే:

ఏనుగు ఒక్కటే 4 మోకాళ్ళుగల జంతువు.

* * *

### మానవ శరీరంలో ముఖ్యమైన నాడి:

మానవ శరీరంలో వెన్నుపూస ముఖ్యమైన నాడి.

* * *

### మాంటేగ్ అంటే?

మాంచేగ్ అనే ఫ్రెంచి మాటకు కొండ అని అర్థం.

* * *

### సుగర్‌లోఫ్ పర్వతం:

సుగర్‌లోఫ్ పర్వతం బ్రెజిల్‌లో ఉంది.

* * *

### రష్యానుండి అలాస్కాను అమెరికా కొన్నది:

ఎకరం 2 సెంట్ల చొప్పున అమెరికా రష్యానుంచి అలాస్కాను కొంది.

* * *

### మానవ దేహానికి సున్నం చేసే మేలు:

మానవ దేహంలో ఎముకలు బలిష్టంగా

## సుభాషితాలు

మాటలాడు గల్గు మర్మము లెఱిగిన
పిన్న పెద్దతనము లెన్నవలదు
పిన్నచేతి దివ్వె పెద్దగా వెలుగదా?
విశ్వదాభిరామ వినురవేమ!

[మాట నేర్పుగలవాడు చిన్నవాడైననూ, పెద్దవాడైననూ సమానమే. భేదములేదు. చిన్నవాని చేతిలో ఉన్నా దీపం ఎక్కువగానే ప్రకాశిస్తుంది.]

* * *

కావిపంచె కట్టి కడు యోగివలె నుండి
వెలికి కోర్కెలెల్ల విడిచిపెట్టి
తొరగి తిరుగువాడు దొంగసన్యాసిరా
విశ్వదాభిరామ వినురవేమ!

[డాంభికుడు కాషాయరంగుల బట్టలు కట్టి కోరికలు లేనట్టు నటించినంత మాత్రం కోర్కెలు లేకుండా ఉండవు. అటువంటివాడు కపటసన్యాసి.]

పెరగడానికి కాల్షియం అనే రసాయనిక పదార్థం తోడ్పడుతుంది.

సి.ఒ.డి. అంటే?:

సి ఒ డి అనే (C O D) అనే విడి అక్షరాలకు క్యాష్ ఆన్ డెలివరీ అని అర్థం.

* * *

ఆంగ్లంలో 'సి' అనే అక్షరం:

ఆంగ్లంలో 'C' అనే అక్షరం రోమన్ అంకెలలో 100 కి సంకేతం.

* * *

చీమల గుంపు:

చీమల గుంపును కాలనీ (colony) అంటారు.

* *

సెయ్‌గాన్ ఇప్పుడు హొచిమిన్ నగరం:

వియట్‌నామ్‌లో ఈనాటి హోచిమిన్ నగరం ఆనాటి సెయ్‌గాన్ (Saigon).

* * *

ప్రపంచంలో మిక్కిలి విస్తారంగా మాట్లాడుకునే భాషలు:

మాండరిన్ చైనీస్, ఇంగ్లీష్, రష్యన్ ప్రపంచంలో విసారంగా మాట్లాడుకునే మూడు భాషలు.

* * *

ఏనుగు ఆయువు:

ఏనుగు 70 సంవత్సరాలపాటు జీవిస్తుంది.

* * *

శరీరంలో మిక్కిలి బలిష్టమైనఎముక:

తొడ ఎముక శరీరంలో మిక్కిలి బలిష్ట మైన ఎముక.

## అవలాంఛ్ అంటే ఏమిటి?



పెద్ద పర్వతాలమీద వర్షాలకంటే ఎప్పుడూ మంచు అధికంగా కురుస్తుంది. ఈ విధంగా కురిసే మంచు పర్వతాల వాలుల మీద ఒత్తుగా పేరుకు పోతుంది. కొంతవరకు పేరుకొన్న తరువాత బ్రహ్మాండమైన ఒత్తిడి ఏర్పడి పైపొర అడుగున మంచుగడ్డ తయారవుతుంది. ఈ మంచుగడ్డలు మెల్లిమెల్లిగా పర్వతాలనుంచి క్రిందికి జారతాయి. మంచు కురిసే కొండవాలులు మృదువుగా ఎక్కువ వాలుగా ఉంటే మంచుభారానికి జారే మంచుగడ్డలు మరింత వేగంతో కొండలో రాళ్ళను మట్టి పెల్లలను తోసుకుంటూ ముందుకు జారి భూమిమీద పడతాయి. ఇవే అవలాంఛ్‌లు.

మధ్య యూరపులో ఆల్ప్స్ మరియు హిమాలయ పర్వతాల మీద దక్షిణంవైపు, పడమటి వైపు సూర్యుని వేడిమికి మంచు గడ్డలు కరిగి అవలాంఛ్‌లు ఏర్పడతాయి.

# కలకత్తా మెట్రో రైలు దారి

స్వరంగ రైలుమార్గం తలపెట్టిన తొలి వ్యక్తి లండన్ నగరపు వకీలు చార్లెస్ పియర్సన్. ఆ తరువాత 20 సంవత్సరాల దీర్ఘకాల పరిశ్రమ ఫలితంగా జనవరి 10,



1863 న లండన్‌లో ఫారింగ్‌డన్ వీధినుండి బిషప్ రోడ్డువరకు 6 కిలోమీటర్ల స్వరంగ మార్గంలో మొట్టమొదటి ఆవిరియంత్రం బయలుదేరింది. రోడ్డుకు రెండు ప్రక్కల కాలువలు త్రవ్వి రెండుప్రక్కల ఇటుకలు పేర్చికట్టి పైన ఇటుకలతో ఆర్చిని నిర్మించారు. దానిపైన రోడ్డుపరచారు. అది ఒక విజయమనే చెప్పాలి. మొదటి సంవత్సరంలోనే 95,00,000 మంది ప్రయాణీకులు ప్రయాణం చేసారు.

మొదటి మరియు రెండవ ప్రపంచ యుద్ధాలలో ఈ స్వరంగంలో స్టేషనులు ఎయిర్ రెయిడ్ రక్షక ఆశ్రయాలుగా ఏర్పడ్డాయి.

కలకత్తా నగరంలో రోడ్లమీద ట్రాన్స్పోర్టు రద్దీ సమస్యను తీర్చడానికి కలకత్తా మెట్రోపాలిటన్ ప్లానింగ్ ఆర్గనైజేషన్ వారు ఒక స్వరంగ రైలుమార్గ నిర్మాణాన్ని చేపట్టి బృహత్తరమైన మెట్రో ట్రాన్స్‌పోర్టు ప్రాజెక్టును ప్రారంభించారు.

ఎస్ప్లనేడ్ నుంచి భోవానీపూర్ వరకు ఈ మార్గం అక్టోబరు 24, 1984 కి పూర్తి చేసారు. ఇది నిర్మాణంలోను, సాంకేతిక పరిజ్ఞానంలోను పారిస్ సబ్‌వే చార్‌మిన్ డిఫర్ మెట్రోపాలిటన్ అనే పారిస్ సబ్‌వేను పోలి ఉండటంచేత దీనికి 'మెట్రో' అని పేరుపెట్టారు.

కలకత్తాలో మెట్రో రైలుమార్గం డమ్‌డమ్‌నుంచి టాలీగంజ్‌వరకు 16.43 కి.మీ దూరం ఉంటుంది. దీని ప్రయాణకాలం కేవలం 33 సెకండ్లు మాత్రమే.

దీనిలో నడిచే ఎయిర్ కండిషన్డ్ రైళ్ళకు స్పాట్ మెషినులతో ఆటోమాటిక్ టికెట్ కౌంటర్సు ఏర్పాటు చేయబడ్డాయి. మాగ్నటిక్ విధానంలో టికెట్లు కూడా త్వరలోనే ప్రవేశపెట్టబడతాయి. ప్రయాణీకుడు ప్రయాణం చేయగల దూరం టిక్కెట్టుమీద

## అమెరికాలో అధిక సంపన్నుడు

అమెరికాలో అధిక సంపన్నుడు సుప్రసిద్ధ ఆయిల్‌మాగ్నెట్ గార్డాన్‌గెట్టీ. ఇతడి ఆస్తి 3.28 బిలియన్ల పౌండ్లని అంచనా వేయబడింది.

"సంపూర్ణమైన ఆత్మార్పణము, స్థిరమైన నమ్మిక అద్భుత కార్యములు.

పంచ్ చేయబడుతుంది. టిక్కెట్లు లేకుండా ప్రయాణం చేసేవారికి, టిక్కెట్ల ఛార్జీసమంగా చెల్లించనివారికి బయటకు పోయే మార్గంలో ఎక్సిట్ తలుపులు తెరుచుకోవు.

ఈ స్వరంగ రైలుమార్గం ఎస్ప్లనేడు నుంచి భొవానీపూర్‌దాకా మాత్రమే పూర్తి అయింది. మిగతా రైలు దారి ఇంకా పూర్తి చేయాలి. ఈనాడు సుమారు 15,000 మంది ప్రయాణీకులు ఈ మెట్రో దారిని ఉపయోగిస్తున్నారు. బాగా అభివృద్ధి పొందిన రిమోట్ కంట్రోల్డ్ కంప్యూటర్ ప్రోగ్రామ్డ్ సర్వీసు సౌకర్యాలతో ఈ రైలు ప్రయాణీకులకు ఎంతో ఆనందాన్ని చేకూరుస్తూంది.

('పార్థా బులిటిన్' సౌజన్యంతో)

## ఎడిసన్ – హోమంని 1300 కాపీరైట్లు



అమెరికాలో థామస్ ఆల్వా ఎడిసన్ ప్రపంచంలో అనేక నూతన పరికరాలను కల్పించిన మహా మేధావి. వీరు తమ సుదీర్ఘ జీవితంలో కనిపెట్టిన క్రొత్త పరికరాలు అనేకం ఉన్నాయి. ఎలక్ట్రిక్ వోటు రికార్డరు కనిపెట్టారు. పారాఫిన్ కాగితం కనిపెట్టారు. స్టాక్‌టికర్‌ను అభివృద్ధి పరచారు. ఎలక్ట్రిక్ పెన్ కనిపెట్టి దానిని అభివృద్ధిపరచి మిమియోగ్రాఫ్‌గా మార్చారు. ఈనాటి మైక్రోఫోనుకు పునాదులు ఏర్పరచడమే గాక బెల్స్ టెలిఫోన్ విధానం ఉపయోగపడేటట్టు కార్బన్ టెలిఫోనును కనిపెట్టారు. ఫోనోగ్రాఫ్, మొట్టమొదట వినియోగయుక్తమైన ఎలక్ట్రిక్ బల్బులు, ఎలక్ట్రిక్ జనరేటర్లు, మోటార్లు, లైట్‌సాకెట్లు, సామర్థ్యవంతమైన ఎలక్ట్రిక్ స్టోరేజి బ్యాటరీ, ఎలక్ట్రిక్ రైల్వే విధానానికి అవసరమైన వివిధ విడిభాగాలు, ఆటోమేటిక్ సిగ్నల్ విధానం, డిక్టేటింగ్ మెషీను మొదలైనవాటిని ఎన్నిటినో కనిపెట్టారు.

ఉపయోగానికి వీలుగా మొట్టమొదటి టైప్‌రైటర్‌ను కనిపెట్టారు. ఆధునిక రేడియో టెలివిజన్‌లను సాధ్యపరచే వాక్యూము ట్యూబును కనిపెట్టినది వీరే. సినీమాలుతీసే కెమేరా కనిపెట్టి శబ్దప్రసార విధానంతో టాకీ చిత్రాలకు మార్గం చూపిన మహనీయుడు. కృత్రిమ రబ్బరు సృష్టించాడు.

1931 వ సం॥లో మరణించేనాటికి వీరు సుమారు 1300 యు. ఎస్. మరియు ఇతర విదేశీ కాపీరైటు హక్కులను కలిగి ఉన్నారు.

# 'శబ్దం'-కనిపించని శత్రువు

డా. ఎస్. కామేశ్వరన్

చప్పుడు అనేక ౦కాలు. తరతమ భేదాన్ని బట్టి, నైజాన్నిబట్టి ధ్వని, నాదము, నినాదము, నిస్వనము, మోత, రవము, శబ్దము,



కలకలము, కోలాహలము, ఘోషము, తుములము అనబడుతుంది. జన సమూహం వల్ల జనించిన శబ్దం సందడి. ఈనాడు మానవుని నిత్యజీవితంలో శబ్దం ఆక్రమించి చోటు చేసుకుంటూంది. ఇందుగల డందు లేదనే సందేహం లేకుండా ఈశబ్దం ఎక్కడ బడితే అక్కడ ఇంట్లో, ఆఫీసులో, ఫ్యాక్టరీలో, కార్ఖానాల్లో, రోడ్లమీద, పైన ఆకాశంలో రకరకాలుగా ఉద్భవిస్తూంది. పరిస్థితులు చాలా విషమించి శబ్దం స్థాయిలో ను, మానవులమీద వాటి ప్రభావంలోనూ కూడా ఒక సందిగ్ధ స్థితిని చేరుకుంది.

"వృద్ధాప్యం పెరుగుతున్న కొద్దీ
సూక్తిని నమ్మలేకుండా ఉన్నాను."

1930 వ సం. నాటికే ఆయాసంస్థలలో పనిచేసేవారికి ఆయా శబ్దప్రభావంవల్ల సంభవించే చెవుడునుబట్టి "బాయిలర్ వర్కర్స్ ఇయర్," "వీవర్స్ డెఫ్‌నెస్," "షూటర్స్ డెఫ్‌నెస్," "లోకోమోటివ్ ఇంజనీర్స్ డెఫ్‌నెస్" అని వివిధ రకాలుగా వర్గీకరించారు. సర్వ సాధారణంగా పారిశ్రామిక కార్యాలయాలలో ధ్వనివల్ల అనేక విధాల బెడదలు, చికాకులు ఉంటూ ఉండేవి. ఇప్పుడు పారిశ్రామిక కార్యాలయాలలో నే కాదు, సైనిక జీవితంలో, పౌరజీవితంలో సాముదాయక ఉద్యమాలు కార్యక్రమాలు పెరుగుటవల్ల,

---

## సారస్వత వ్యామోహం సాటిలేని దివ్యానందం

మానవ మాత్రులకు భగవంతుడు ప్రసాదించిన దివ్యానందమార్గం పుస్తకాభిలాష, సద్గ్రంథాభిమానం. జీవితంలో అన్నిసుఖాలు, సంతోషాలు ఉడిగినా నిత్యచైతన్యంగా భాసించేది సారస్వత వ్యామోహం. ఇతర వినోదాలు, ఉల్లాసాలు ఒంపించినప్పుడు ఇదే ఆసరా. ఆమరణాంతం పోషిస్తుంది. జీవించి ఉన్నంతకాలం క్షణక్షణం నిత్య నూతన ఆనందాన్ని, మానసిక ఉల్లాసాన్ని కలిగిస్తుంది సద్గ్రంథాభిలాష.

వివేకం వృద్ధిపొందుననే
—హెచ్.ఎల్. మెన్‌కెన్

త్వరిత పరచబడిన రాకపోకల సౌకర్యాల వల్ల ఇవి మెచ్చు పెరిగిపోయాయి. గూబలు అదరగొట్టే ధ్వనులవల్ల మానవులలో ఒక్క చెవిటి తనమే గాకుండా, ఇతర అనేక



వృక్షాలు శబ్దనిరోధకాలు

రోగాలను నివారించి నిరోధించడం వైద్య రంగంలో ముఖ్య విభాగంగా పరిణామం పొందింది.

దేశము యొక్క పారిశ్రామికాభివృద్ధితో బాటే వాతావరణంలో ధ్వని కాలుష్యం ఉజ్జీ వేసుకుని ఉంటూంది. ప్రకృతి సిద్ధంగా ఏర్పడ్డ కొన్ని శబ్దాలు, ఆధునిక యంత్ర సాధనల ఉపయోగంవల్ల అనివార్యమైన ధ్వనులు, మనం అభిలషించని నినాదాలు. ధ్వని కాలుష్యం గురించి ప్రస్తావించేటప్పుడు పారిశ్రామికోద్యమాలవల్ల జనించిన ఘోషలు మనకు ముందు స్ఫురిస్తాయి. రాకపోకల సాధనాలు, యంత్రాలవల్ల జనించే అవాంఛిత శబ్దాలు, సాముదాయికోద్యమాలతో పుట్టే అభిలషించని శబ్దాలు కూడా మానవునికి హానికరమే.

కొన్నిరకాల చెట్ల పెరుగుదల వాతావరణంలోని శబ్దాల తీవ్రతను చాలావరకు తగ్గిస్తున్నాయని పరిశోధనలవల్ల తెలుసుకున్నారు. ఒకానొకప్పుడు వృక్షసంపదతో నిండిన అటవీ సౌభాగ్యం గల భారతదేశం వంటి వర్ధమాన దేశాలలో రోడ్లరవాణాల అభివృద్ధి కార్యక్రమాలవల్ల తరచుగా వృక్షాలను నిర్మూలించి, నరికి నాశనంచేసి నూతన రోడ్లు నిర్మాణం కొనసాగుతూంది. ఇది శబ్ద సమూహాభివృద్ధికి, ధ్వని కాలుష్యాభివృద్ధికి మరింత దోహదం కలిగిస్తూంది.

భారతదేశంలో దైనందిన జీవితంలో సామూహిక శబ్దాలు ముఖ్యపాత్రను వహిస్తున్నాయి. కారు, రైలు, స్కూటర్, బస్ శబ్దాలవలె ఇతర పారిశ్రామిక శబ్దాల అపకారం అధికంగా ఉంది. ప్రాచీనకాలంలో ఆదిమవాసులు భావ వ్యక్తీకరణకుశబ్దాన్ని ఉపయోగించుకున్నారు. వారి సాంఘిక, పెళ్ళిళ్ళ ఉత్సవాలు, శవాల ఊరేగింపులు మొదలైన

---

## మానవుడు ఆత్మవంచకుడు!

మానవుడికి భగవంతుడు మార్గం చూపిస్తుంటే మానవుడు తనకు తానే మోసం చేసుకుంటున్నాడు. ప్రపంచంలో అధమ జీవులైన మర్త్యుల పొరపాట్లను శాశ్వతమైన ప్రకృతి పరిశీలిస్తుంది. విరుద్ధమైన ఈ చిక్కులోనుంచి విడివడి నిర్మలమైన. నిష్కళంకమైన జ్ఞానోదయం కలిగించుకోవాలి. ఆత్మ సంయమనంతో దోషరాహిత్యమైన జీవితం సాధ్యం. —శ్రీ అరబిందు

"చీకటిలోకి దీపికను తీసుకుని రాగలరు,
కాని చీకటిని వెలుతురుగా మార్చలేరు."

సందర్భాలన్నీ చెవులు బద్దలయ్యే శబ్దంతో కూడుకున్నాయి.



బస్ శబ్దం

ముందు ఉదహరించినట్టు పారిశ్రామి కోద్యమాలవల్ల పుట్టే ధ్వనులు, హోరులు మానవుని శ్రవణేంద్రియానికి కలిగించే అపకారం ఎంతో! ఇటీవల దక్షిణాది ప్రాంతాలలో నిపుణుల పరిశోధనలవల్ల ఈ క్రింది విషయాలు స్థిరపరచబడ్డాయి. మద్రాసులో వివిధరకాల ఇనుము, అల్యూమినియం కాస్టింగులను ఉత్పత్తిచేసే ఫౌండరీలలో 102 డెసిబిల్స్ శబ్దం ఉత్పన్నమౌతూంది. కోయంబత్తూరులో పరికరాలను ఉత్పాదించే టూల్ మాన్యు ఫ్యాక్చరింగ్ ఫ్యాక్టరీలలో 91 డెసిబిల్స్ శబ్దధ్వని పుడుతూంది. విస్తృతశ్రేణిలో అనేక రకాల సోపులను తయారుచేసే కొచ్చిన్ ఆయిల్ మిల్‌లో ఉత్పాదనపొందే శబ్దం మొత్తంమీద 92 డెసిబిల్స్. తిరువాన్కూర్ టబ్బర్ టైర్లఫ్యాక్టరీ 93 డెసిబిల్స్ శబ్దం శబ్దిస్తూంది.

బస్సులు, కార్లు మొదలైన ఇతర యాంత్రిక సాధనాలవల్ల దక్షిణ ప్రాంత ప్రదేశాలలో కొన్ని నగరాలలో ఉద్భవించే ధ్వని మానవునికి అపాయం కలిగించే 80 డెసిబిల్స్ ధ్వని స్థాయిని మించిపోయి ఉంది. మద్రాసు వీధుల అధికంగా రద్దీ, సందడి ఉండే ట్రాఫిక్ కేంద్రాల దగ్గర శబ్దం 85 మొదలు 89 డెసిబిల్స్‌లో ఉంటుంది. కొచ్చిన్, తిరువాన్కూర్ వీధులలో కొన్ని కొన్ని కేంద్రాలలో పరిస్థితులు అపాయాన్ని కలిగించే స్థాయికి చేరుకుంది శబ్ద తీవ్రత.

పెళ్ళి వేడుకలలో సందడివల్ల శబ్దం 100 డెసిబిల్స్ స్థాయిలో ఉంటుంది. శవాల ఊరేగింపులలో కోలాహలం 98 డెసిబిల్స్‌కుఅందుకుంటుంది. ఇక బహిరంగ సభలలో, ఉపన్యాసాలలో, పురాణ కాలక్షేపాలలో శబ్దస్థాయి 95 నుండి 98 డెసిబిల్స్. ముఖ్యంగా దీపావళివంటి పండుగ దినాలలో బాణాసంచా

## 20 రెట్లువాకా పెరిగిన పత్రికల, పుస్తకాల ఎగుమతి

భారతదేశంలో పుస్తకాలు, ఇతర (వార పక్ష, మాస) పత్రికల ఎగుమతి విలువ 1971-72 లో ఉన్న రూ. 11.83 మిలియన్ల నుంచి—1983 ల రూ. 250 మిలియన్లు అయింది. భారతదేశం బ్రిటను, అమెరికా, మలేషియా, సింగపూరు, నేపాలు, బంగ్లాదేశ్ మొదలగు 80 దేశాలకు వీటిని ఎగుమతి చేసూంది.

"ఆత్మశుద్ధిగల ఒక వ్యక్తి, ప్రబోధకుల కంటే ఎక్కువ కార్యము సాధింపగలడు."

కాల్పులవల్ల 105 మొదలు 108 డెసిబిల్స్ ధ్వని కలుగుతూంది.



మైకుల బెడద

ధ్వని మానవుని ఆరోగ్యాన్ని ధ్వంసం చేస్తుంది. అనేక రోగాలకు ముఖ్యకారణం ఇది. సుప్రసిద్ధ అమెరికన్ ఇయర్ సర్జన్ డా. శామ్యూల్ రోసెన్, మీరు సహించినా మీ శరీరం శబ్దాన్ని సహించలేదని వివరించాడు. ధ్వని మనకంటికి కనిపించని శత్రువు.

ధ్వని మన నిత్యజీవితంలో మూడు విధాలుగా ప్రభావితమౌతుంది. విపరీత ధ్వనుల వల్ల మన శ్రవణేంద్రియం చెడిపోవడం, శరీరంలో అనారోగ్య పరిస్థితుల అభివృద్ధికి దోహదం కలిగించడం, సాంఘిక జీవనానికి ఇబ్బందులు కలిగించడం జరుగుతుంది.

నిరంతరం వర్క్‌షాపుల చప్పుడికి గురిఅయేవారికి తాత్కాలికంగా చెవి వినిపించకపోవచ్చు లేకపోతే సుస్థిరమైన బధిరత్వం కలుగవచ్చు. వర్క్‌షాపులలో పని చేసేవారికే కాకుండా ఇతరులకు కుడా విపరీత శబ్దాల వల్ల చెవికి సంబంధించిన అనేక రోగాలు కలుగుతాయి.

పనిచేసేవారికి శబ్దం ఎంతో అపాయకరం అవడమే కాకుండా వారి శక్తి సామర్థ్యాలను తగ్గించేసి ప్రమాదాలు జరగడానికి అవకాశాలు ఏర్పడుతున్నాయి. ధ్వని ఎక్కువగా జనించే పరిసరాలలో ముఖ్యంగా దార్ఢ్యత లేనివారికి ఆందోళన, చికాకు, చిరాకు, నిస్త్రాణ కలగటం సహజం. కాబట్టి పరిశ్రమలలో శబ్దం రెండు విధాలుగా ప్రభావితమౌతుంది. కార్మికుల ఆరోగ్యం దెబ్బతినడమే గాకుండా వస్తు ఉత్పాదకశక్తి నాశనం అయిపోతూంది.

పారిశ్రామిక శబ్ద నివారణకు ప్రత్యక్ష మార్గం-ధ్వనికారకములైన యంత్రాలనుంచి ఉద్భవించే శబ్దాన్ని అదుపులో పెట్టి తగ్గించాలి. యంత్రాలవల్ల ఏర్పడే ధ్వనిని ఖాతరు చేయకుండా మామూలుగా యంత్రాలురూపొం

---

## అతి పెద్ద టెలిస్కోప్ నిర్మాణం 6 సం॥లలో పూర్తి అవుతుంది

ఖగోళ పరిశోధనలకు ప్రపంచంలో అతి పెద్ద దూరదర్శిని ఇండోనేషియాలోని పశ్చిమ సుమత్రాలో ఇక 6 సం.లం నిర్మింపబడుతుంది. మొత్తం 30 మిలియను డాలర్ల వ్యయంతో నిర్మింపబడే ఈ రేడియో టెలిస్కోపు పొడవు 2,000 మీటర్లు, వ్యాసం 50 మీటర్లు ఉంటుంది.

"స్వేచ్ఛకు గుర్తు సమానత్వము."

దించి తయారు చేస్తున్నారు. యంత్రాలు చేసే రొద లేక ధ్వని స్థాయిలను ఇండియన్ స్టాండర్డ్స్ ఆర్గనైజేషన్‌వారు 1968 వ సం.లో నిర్ణయించి ప్రచురించారు. ప్రభుత్వం వారు దీనికి అనుగుణ్యంగా యంత్ర ధ్వని నిషేధక చర్యలు అవలంబించాలి. ఇంతే గాకుండా వివిధ రకాల యంత్రాలవల్ల కలిగే శబ్దస్థాయిని చట్టబద్ధంగా స్థిరపరచాలి.

సరిగా పనిచేయని మెషీనులు ఎక్కువ శబ్దం చేస్తాయి. సక్రమంగా మెషీనుకు ఓవరాయిల్ చేస్తూ గ్రీజుపెట్టి వాటి శక్తిసామర్థ్యాలను పరిశీలిస్తూండాలి. చాలా పాత మెషీనులను కొత్తవాటితో మార్చుతూ ఉండాలి.

పరిశ్రమలలో అధిక శబ్దంతో కూడిన పనులను తక్కువ శబ్దం కలిగేటట్టుగా మార్చాలి. వెల్డింగ్‌కు బదులుగా రివెటింగ్ అవలంబించవచ్చు. అధికవేగంతో శబ్దంతో పాలిష్ పెట్టడంకన్న రసాయనిక చర్యలవల్ల లోహాలకు మెరుగుపెట్టవచ్చు. లోహపు విడిభాగాలకు బదులుగా రబ్బరు లేక ప్లాస్టిక్ విడిభాగాలను ఉపయోగించాలి. ఎక్కువ శబ్దం చేసే పెద్ద పెద్ద మెషీనులను దూరంగా ఏర్పాటు చేయవచ్చు. చెట్లు, వృక్షాలు కొంత వరకు శబ్దాన్ని తగ్గిస్తాయి. కాబట్టి ఇండస్ట్రియల్ కాంప్లెక్స్‌లలో చుట్టుపట్ల రకరకాల చెట్లను పెంచాలి.

ఇండస్ట్రియల్ కాంప్లెక్స్ పరిసరాలలో వాసయోగ్యమైన ఇళ్ళు, పాఠశాలలు ఏర్పరచకూడదు. నివాసస్థలాల మధ్యగానీ, చేరువగా గానీ ఇండస్ట్రియల్ కాంప్లెక్స్‌లను చట్టబద్ధంగా నిషేధించాలి.

పెద్ద పెద్ద ధ్వనులు, శబ్దాలు కలిగే పరిసరాలలో పనిచేసే కార్మికుల ఆరోగ్యం (మిగతా 34 వ పేజీలో)

## త్రాచుపాము కరచినా బ్రతికి బైటపడే సూచనలు



త్రాచుపాములు కరిచినప్పుడు వాటి విషం అందరిమీదా ఒకే రీతిగా పరిణమించదని, వివిధ బ్లడ్ గ్రూపులు గల మానవుల మీద వివిధ రకాలుగా ఉంటుందని రక్తంలో (A B) గ్రూపు గల వ్యక్తికి త్రాచుపాము విషం ఇంజక్షను చేస్తే 40 నిమిషాలలో రక్తం గడ్డకట్టుకుపోయిందని, ఇదే 'O' గ్రూపులో రెట్టింపు కాలం తీసుకుంటుందని పాట్నా (బీహారు) ఫోరెన్సిక్ సైన్స్ లాబొరేటరీలో ఎ. ఎల్. ఆర్. సిన్హా తన పరిశోధనా ఫలితంగా ప్రకటిస్తున్నారు. దీనివల్ల పాము కరచినవారికి ప్రథమ చికిత్స కల్పించి తగిన విషప్రతీకార చర్యకు కావలసిన అవకాశం, కలిగి రోగి బ్రతికి బయట పడగల సూచనలు కనిపిస్తున్నాయి.

"జ్ఞాన సిద్ధునకు మోక్షము కరతలామలకము."

# వీరిని గురించి తెలుసుకోండి

కె.ఎమ్. మున్షీ: అనేక శాస్త్రాలలో అభినివేశం గల గొప్ప విద్యావేత్త, రాజకీయ



వేత్త, ధర్మశాస్త్ర విదుడు, సంస్కరణ కర్త, నిర్వహణ చతురుడు. వీరు స్థాపించిన భారతీయ విద్యాభవన్ వీరి సృజనాత్మకం వల్ల, నైపుణ్యం వల్ల అఖిలభారత కేంద్రంగా అభివృద్ధి పొందింది. యోగసూత్రములు, భగవద్గీత వీరికి స్ఫూర్తిని కలిగించిన పవిత్ర గ్రంథములు.

* * *

హెడీ లామార్: ఒకప్పుడు హాలీవుడ్ సినీమా నటులలో అగ్రగణ్యురాలుగా పేరు పొందింది. ప్రపంచ ప్రఖ్యాతిపొందిన 'సామ్ సన్ అండ్ డెలీలా' అనే చిత్రంలో 'డెలీలా' ఈమె వహించిన ఉత్తమ పాత్ర.

* * *

డి.ఏ.లా ఫాన్ టెయిన్: వాయు విమాన సంస్థకు ముఖ్య అధికారి (Chief of Air Staff) ఫైటర్ పైలట్‌గానూ, అతి భద్రత ఫ్లైటర్ పైలట్‌గాను మంచి నైపుణ్యాన్ని సాధించిన యోధుడు. ప్రసిద్ధి పొందిన గోల్ఫర్ మరియు ఫొటోగ్రాఫర్ కూడా.

* * *

కె. భాగ్యరాజ్: తమిళనాడులో సుప్రసిద్ధ రచయిత, సినీనటుడు, డైరెక్టరు. "ఒరుకై ఓసై", మరియు "డార్లింగ్, డార్లింగ్, డార్లింగ్" బాగా ప్రచారం పొందిన ఈతడి చిత్రాలు.

* * *

(మిగతా 41 వ పేజీలో)

## 2000 సం॥ లో ప్రపంచంలో 520 న్యూక్లియర్ రియాక్టర్లు

2000 ఎ. డి. సంవత్సరానికి ప్రపంచంలో ఇప్పుడు ఉంటున్న 320 రియాక్టర్లు 520 కి పెరుగుతాయి. ప్రస్తుతం అణుశక్తితో ఉత్పాదిస్తున్న 2,00,000 MW విద్యుచ్ఛక్తి ప్రపంచపు మొత్తం విద్యుత్తు ఉత్పాదకశక్తిలో 12 శాతం పెబడి ఉంది.

"ఎవరిభారం వారిది, ఒకరి భారం మరొకరికి తెలియదు."

# రచయితలు అందరూ పేదవారు కాదు

నితీష్ ఎస్ రీలీ

సాధారణంగా రచయితలు, గ్రంథకర్తలు ధనికులు కాదనీ, సరస్వతీ కటాక్షం ఉన్నవారికి లక్ష్మీకటాక్షం ఉండదని మనలో ఒక దురభిప్రాయం ఏర్పడిపోయింది. కానీ లోతుగా పరిశీలిస్తే వ్యాపారస్తులకంటే, పెద్ద



కానన్ డైల్

పెద్ద ఉద్యోగస్తుల కంటే గ్రంథకర్తలే అధిక ధనవంతులనే సారాంశం తేటపడుతూంది.

అమెరికాలో సుప్రసిద్ధ డిటెక్టివ్ నవలా రచయిత ఎడ్గార్ వాలెస్ సంవత్సరానికి 50,000 పౌన్లనుండి 1,00,000 పౌన్లు సంపాదించాడు. 1932వ సం॥లో ఇతడు మరణించినప్పుడు ఇతడి ఎస్టేటు మీద 2,00,000 పౌన్లు అప్పు తేలింది. ఆస్తులన్నీ విక్రయించి ఐదు సంవత్సరాలలో అప్పులు తీర్చబడ్డాయి.

షెర్లాక్ హోమ్స్ రచించిన ఆర్థర్ కానన్ డైల్ సమృద్ధిగా ధనం సంపాదించి గ్రామంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నాడు. 1930వ సం॥ర ఇతడు మరణించినప్పుడు ఇతడి వారసులకు 50 దేశాలనుంచి రాయల్టీలు లభించాయి. ఇతడు రచించిన కథ ఒక్కొక్కటి 500 పౌన్లకు అమ్మబడింది. ఒక అమెరికన్ కంపెనీ ఒక్కొక్కమాటకు ఒక పౌండు చొప్పున చెల్లించి ఒక్కొక్కటి 3,500 మాటలుగల 6 సీరియల్ కథలను కొన్నది. సామర్‌సెట్‌మామ్ ఒక

---

## మిక్కిలి పొడవైన రైలుమార్గం

మిక్కిలి పొడవుగా సాగిన రైలుమార్గం ఆస్ట్రేలియాలోని ట్రాన్స్ కాంటినెంటల్ రైలు మార్గం. ఇది 328 మైళ్ళ పొడవుగా ఉంటుంది. దీని తరువాత దక్షిణ అమెరికా ఆర్జెంటీనాలో బ్యూనస్ ఎయిరీస్ మరియు పసిఫిక్ రైలుదారి జూనిన్ మరియు మా చెన్నామార్గం. దీని పొడవు 205 మైళ్ళు.

"నిరంకుశులపై తిరుగుబాటు భగవత్ సేవతో సమానం." —బెంజమిన్

పెద్ద గ్రంథకర్తగా రెండు మిలియను పౌండ్లు సంపాదించాడు.



సామర్ సెట్ మామ్

ప్రసిద్ధిపొందిన నాటకకర్త జార్జి బెర్నార్డ్ షా మరణించినప్పుడు అతడి ఆస్తి విలువ 3,00,000 పౌండ్లకు (సుమారు 50 లక్షలు) పైబడి ఉంది. థామస్ హార్డీ 91,000 పౌండ్లు, జాన్‌గాల్స్‌వర్దీ 88,000 పౌండ్లు, జార్జిమూర్ 75,000 పౌండ్లు, జార్జి మెరిడిత్ 32,000 పౌండ్లు, జోసెఫ్ కానార్డ్ 20,000 పౌండ్లు సంపాదించారు.

కొంతమందికి తాము వ్రాసిన మొదటి గ్రంథంతోటే అదృష్టం పండుతుంది. జాన్ బ్రెయినే రచించిన "రూమ్ ఎట్ ది టాప్" (Room at the top) అనే గ్రంథం బాగా అమ్ముడైన గ్రంథం. ఇదే అతడి మొట్ట మొదటి పుస్తకం అయినా దీనిమీద ఇతడికి ఫిల్మురైట్స్‌వల్ల మాత్రమే 5,000 పౌండ్లు ముట్టింది. అసలు పుస్తకం అర మిలియను ప్రతులు అమ్మబడ్డాయి. ఆలాన్‌సిల్లిటో అనే మరో రచయిత నాటింగ్‌హామ్ ఫ్యాక్టరీలో పని చేస్తూ రచించిన 'సాటర్‌డే నైట్' మరియు 'సండే మార్నింగ్' కథ ప్రచురించడానికి ముందే రిలీజైన సినిమా మీద 5,000 పౌండ్లు సంపాదించాడు. 'ది టనెల్' అనే గ్రంథాన్ని రచించిన ఎరిక్ విలియమ్స్ కూడా ఇలాగే చాలా ధనం సంపాదించాడు. ఇతడి నవల 2,63,000 కాపీలు అమ్మబడ్డాయి. ఎ. ఎస్. ఎమ్. హచిన్‌సన్

## క్రొవ్వొత్తి వెలుగుతో వీనులకు విందు

యునైటెడ్ స్టేట్స్ న్యూజెర్సీలో నివసిస్తున్న జెన్‌కా రూజెక్, పావెల్ రూజెక్ మరియు జూరీపెసెక్ అనే ముగ్గురు నూతన కల్పనా సామర్థ్యులు క్రొత్తగా కనిపెట్టిన క్రొవ్వొత్తి వెలిగిస్తే సుశ్రావ్యమైన సంగీతం ప్రసారమవుతుంది. క్రొవ్వొత్తిలో నిలువుగా వొత్తి ప్రక్కగా ఈ చివరనుంచి ఆ చివరకు ఆప్టికల్ ఫైబర్ అమరుస్తారు. క్రొవ్వొత్తిని వెలిగించినప్పుడు వత్తి మండటం ప్రారంభించగానే ఆప్టికల్ ఫైబర్ పైకొన కాంతిని గ్రహించి రెండవ కొనకు ఫోటో ట్రాన్సిస్టరుకు ప్రసరిస్తుంది. ఇవి వెంటనే ముందుగా ప్రోగ్రాం చేయబడిన మైక్రోచిప్ మీది మీటలను నొక్కుతాయి. వెంటనే సంగీతం ప్రారంభమవుతుంది.

—('న్యూసైంటిస్టు' సౌజన్యంతో)

"మనం పథకాలు వేస్తూండగా
మనకు సంభవించేదే జీవితం." —సాండర్

'ఇఫ్ వింటర్ కమ్స్' వ్రాసి 70,000 పౌండ్లు, 'ఎచ్. ఎమ్. ఎస్. యులిసిస్' వ్రాసి మెక్లీన్స్ 50,000 పౌండ్లు సంపాదించారు.



జోసెఫ్ కానార్డ్

డేల్ కార్నీజ్ వ్రాసిన మొదటి గ్రంథం "హౌ టు విన్ ఫ్రెండ్స్ అండ్ ఇన్ఫ్లుయెన్స్ పీపుల్' మంచి అనుభవం మీద వ్రాసినదైనా ఎవ్వరూ ప్రకటించడానికి ఆమోదించలేదు. 17 మంది పబ్లిషర్స్ దీన్ని నిరాకరించారు. చివరగా సైమన్ మరియు చెష్టర్ ప్రచురించిన వెంటనే అమ్మకాలు ప్రారంభమయ్యాయి. ఇంతవరకూ 50,00,000 కాపీలు సాదా బైండువే అమ్మబడ్డాయి

కథా సాహిత్యంలో మినీ కథకులు దీనికి తీసిపోలేదు. జేమ్స్ థర్బర్ వ్రాసిన 'ది సీక్రెట్ లైఫ్ ఆఫ్ వాల్టర్ మిట్టీ', ఆల్డస్ హక్స్లీ వ్రాసిన 'ది గెయ్‌కొండే స్మైల్' కూడా పెద్ద పెద్ద మొత్తాలకు విక్రయింపబడ్డాయి. రెండూ కూడా సినీ చిత్రాలుగా వెలువడ్డాయి.

అమెరికా నవలా రచయిత ఎర్నెస్ హెమ్మింగ్వే రచించిన ఒక చిన్న కథకు 14,000 పౌండ్లు ఇవ్వబడింది. మరో ఇతర రచయిత ఎవ్వరికీ చిన్న కథకు ఇంత పెద్ద మొత్తం లభించలేదు.

ధనం సంపాదించాలనే ముఖ్య లక్ష్యంతోనే తాము గ్రంథాలను వ్రాస్తాం అని కొంతమంది ఒప్పుకుంటారు. ఇ. ఫిలిప్స్ ఆప్పెన్‌హీమ్ అనే రచయిత బహిరంగంగా ఈ రహస్యాన్ని ప్రకటించి చెప్పాడు. కథారచయితగా తన 50 సంవత్సరాల జీవితంలో 150 పుస్తకాలను ప్రచురించాడు. వందల కొద్దీ చిన్న కథలు, వ్యాసాలు, సీరియల్ కథలు మొదలైనవి, వ్రాసాడు. (మొత్తం వ్రాసిన మాటలు 13,000).

## మానవుని మిత సంభాషణకు 850 మాటలు అవసరం!

మీరు విద్యాసంపన్నులైన సగటుమానవులైతే మీ శబ్దజాలం సుమారు 13.000 మాటలని నిపుణుల అభిప్రాయం. ఆంగ్లంలో అతి మితంగా సంభాషించడానికి అథమం 850 మాటలైనా తెలిసి ఉండాలని భాషాశాస్త్రజ్ఞులు అంటారు. ఆక్స్‌ఫర్డ్ నిఘంటువులో సుమారు 5,00 000 మాటలు చేర్చబడ్డాయి. అసలు ఆంగ్లేయ భాషలో శబ్దజాలం దీనికంటే కూడా చాలా అధికం. ఎప్పటి కప్పుడు వేలకొద్దీ క్రొత్తమాటలు చేర్చబడుతూన్నా ఎన్నో పదాలు ఉపయోగంలో ఉండవు.

"సృష్టికి పూర్వదశ ఏకత్వము, వైవిధ్యమే సృష్టి."



ఆల్డస్ హక్స్లీ

ఆక్స్ఫర్డ్ యూనివర్శిటీ ప్రొఫెసరు జె. ఆర్. ఆర్. టోల్కీన్ వింత పరిస్థితు లలో ప్రఖ్యాతిని పొందాడు. కొన్ని పరీక్షా పత్రాలను దిద్దుతూ ఒక కాగితం మీద అర్థం లేని మాట లేవో (in a hole in the ground there lived the hobbit) రాసాడు. కాని ఇదే అతడి జీవితంలో అద్భుతమైన మార్పు తెచ్చింది. ఇదే వాక్యం మనస్సులో పెట్టుకుని 'ఫెయిరీ స్టోరీలు' వ్రాయిడం ప్రారంభించాడు. ఇవే సుప్రసిద్ధ 'హాబిట్' hobbit గ్రంథాలు. శాశ్వత కీర్తిని గడించిన కవి విలియమ్ షేక్స్పియర్ ఆనాడు సంవత్సరానికి రూ. 200 లు మాత్రమే సంపాదించ గలిగాడు. ఆ మహాకవి జీవించి ఉంటే ఈనాడు అతడి రాయల్టీలు కోటాను కోట్లుంటాయి.

(29 వ పేజీ తరువాయి)

గుర్తుంచుకుని యజమానులు షిఫ్ట్ విధానం, రొటేషన్ విధానం అమలుపరుస్తే కార్మి కులు అధికకాలం పాటు శబ్దానికి గురి అవుతారనే భయం ఉండదు. ఇటువంటివి సాధ్యం కానప్పుడు కార్మికులకు వ్యక్తి గతంగా ఇయర్ ప్లగ్‌లు, ఇయర్ మఫ్స్, హెల్మెట్స్ వంటి సంరక్షణలను అమలు పెట్టాలి. ప్రతీ ఉద్యోగస్థుడు కూడా ఉద్యో గంలో చేరే ముందు శ్రవణవైద్య నిపుణుని (ఆడియాలజిస్టు) వద్ద సూక్ష్మశ్రవణ గ్రాహ్య తకు పరీక్ష చేయించుకోవాలి. అధిక శబ్దం పుట్టే ప్రదేశాలలో పనిచేసే ప్రతీ వ్యక్తికి క్షమతా పరీక్ష (susceptibility test) చేయించాలి. తట్టుకోలేని వారికి అవసరమైన పరిసర మార్పు కలిగించడం ఉత్తమం. లేక పోతే ఇయర్ టిప్స్, ఇయర్ మఫ్స్ వంటి సంరక్షక సాధనాలను ఉపయోగించేటట్టు చూడాలి.

ఇప్పుడు అభివృద్ధిని పొందుతూన్న అనేక దేశాలు శబ్ద కాలుష్యం వల్ల కలిగే అపాయా లకు తగు జాగ్రత్తలను అవలంబిస్తున్నారు. శబ్దనిరోధనకు తగిన చట్టబద్ధమైన తీవ్ర చర్యలను తీసుకుంటున్నారు. చెవికి అపాయ కరమైన డెసిబెల్స్ పరిమితిని వివరిస్తున్నారు. నష్టపరిహారక నిధులను ఏర్పాటు చేస్తు న్నారు. భారతదేశంలో కూడా శబ్దకాలు ష్యాన్ని తగ్గించడాకి తగిన చర్యలు తీసు కుంటున్నారు.

"ఆత్మసాక్షాత్కారమే మానవుని పరమావధి."

# అవీ-ఇవీ

**ప్రపంచంలో మిక్కిలి పెద్ద మొసళ్ళ ఫారం:**

1986 సంవత్సరాంతానికి 20,000 మొసళ్ళకు రక్షణ కలిగించే మొసళ్ళ సంరక్షణ కేంద్రం మొంబాసా (కెన్యా) దగ్గర నిర్మిస్తున్నారు. ఇది ప్రపంచంలోనే చాలా పెద్దది.



కెన్యా దేశపు హిందూ మహాసముద్ర తీర ప్రదేశం చూడడానికి వచ్చే అనేకమంది టూరిస్టులకు ఇది వినోదం కలిగిస్తుంది.

* * *

**తమిళనాడు పాఠశాల విద్యార్థులకు ఉచిత యూనిఫారాలు:**

ఈ సంవత్సరం నుంచి తమిళనాడు ప్రభుత్వం రూ. 25 కోట్ల వ్యయంతో 8 వ తరగతి వరకు విద్యార్థులందరికీ యూనిఫారాలు, పాఠ్యపుస్తకాలు ఉచితంగా పంచి పెడతారు.

* * *

**పుష్టికరమైన 'ఆహారం' ప్రణాళిక క్రింద 80 లక్షలమంది పిల్లలకు లాభం కలుగుతూంది**

తమిళనాడు ప్రభుత్వం చేపట్టిన పౌష్టికాహార ప్రణాళిక క్రింద 80 లక్షలమంది

## ఆనందాన్ని సాధించడమే ప్రథమ లక్ష్యం

నిర్వహించిన ఒక పనిమీద విజయం ఆధారపడి ఉంటే చేసే విధానం, తీరు మీద ఆధారపడి ఉంటుంది ఆనందం. దా వల్లే జీవితంలో పరాజయం పొందినవారు కూడా ఆనందంగా ఉండగలుగుతున్నారు. విజయం అనేది భౌతికంగా పొందేలాభం, సాధించిన దాని ప్రతిఫలం ఆనందం. పొందే ఫలసాయం ఏపైనప్పటికి మన ప్రయత్నాలు పట్టుదలతో చేసామనే మానసిక సంతృప్తే ఆనందం. అట్టి ఆనందాన్ని ప్రధమలక్ష్యంగా పెట్టుకుంటే దానివెంటే విజయం చేకూరుతుంది. విజయానికి వేరే ప్రయత్నించక్కరేదు.

"బాల్యంలో పొరపాట్లు, యౌవనంలో పెనుగులాటలు, వృద్ధాప్యంలో పశ్చాత్తాపం - ఇదే జీవిత రహస్యం."

పిల్లలకు మధ్యాహ్నం భోజనం ఏర్పాటు చేస్తున్నారు. దీంట్లో ఇంకా విద్యాభ్యాసం చేపట్టని పిల్లలు 25 లక్షలమంది. ఈ ప్రణాళికకు సంవత్సరానికి రూ. 180 కోట్లు ఖర్చు అవుతూంది.

* * *

టెస్ట్ ట్యూబ్ ఖర్జూరపు చెట్లు:

హిస్సార్‌లో (హర్యానా) వ్యవసాయ విశ్వవిద్యాలయానికి చెందిన వృక్షశాస్త్రజ్ఞులు టెస్ట్ ట్యూబ్‌లో ఖర్జూరపు చెట్లను దేశంలో మొట్టమొదటిసారి మొలిపించారు. సస్య సంబంధమైన కణాల (plant tisse) అభివృద్ధిలో ఇది ముఖ్యమైన ప్రగతి.

* * *

ద్వారకా శిథిలాలను కనుగొన్నారు:

గుజరాత్‌లో ద్వారకా ద్వీపాలలో శ్రీకృష్ణుని జన్మస్థానమైన ద్వారకా శిథిలాలను డా. ఎస్. ఆర్. రావు బృందం కనుగొన్నారు. ఎయిర్ జెట్‌ల సహాయంతో నిపుణులైన డైవర్స్ సముద్రంలో మునిగిపోయిన శిథిలాలను పైకి తీసారు.

* * *

ఫైబర్ గ్లాస్ పూతపెట్టిన టైరులు:

అమెరికాలోని రబ్బర్ కంపెనీ కొత్తగా ఫైబర్ గ్లాస్ పూతతో మరింత బలిష్ఠం చేయబడిన ఆటో మోబయిల్ టైర్‌లను అమ్ముతున్నారు. సాధారణ టైరుల కంటే ఇవి రెట్టింపు కాలం మన్నుతాయి. ఫైబర్ గ్లాస్ పూతపెట్టిన ఈ టైరులు సుమారు 20,000 మైళ్ళు చెడకుండా మన్నగలవు.

* * *

ఓడలు మునిగిన ప్రాచీన స్థలాలు బయల్పడ్డాయి:

గోవా నేషనల్ ఇన్‌స్టిట్యూట్‌లో సముద్రపు శాస్త్ర (oceanography శాఖకు చెందిన బృందం పురావస్తు ఆధారాలకు

(మిగతా 39 వ పేజీలో)

## 2 మిలియను డాలర్లకు అమ్మిన "స్టార్ ఆఫ్ ఆఫ్రికా" వజ్రం



సుప్రసిద్ధ సినీ నటుడు రిచర్డ్ బర్టన్ అమూల్యమైన 'స్టార్ ఆఫ్ ఆఫ్రికా' వజ్రాన్ని ప్రఖ్యాత సినీతార తన మొదటి భార్యామణి ఎలిజబెత్ టేలర్‌కు ప్రేమకానుకగా ఇచ్చాడు. దానిని వేలంలో అమ్మితే హెన్రీ లాంబెర్ట్ సుమారు 2 మిలియను డాలర్లు ఇచ్చి కొన్నాడు!

"చాడీలు చెప్పేవారి నాలుక కోసినా పాపంలేదు,
చాడీలు వినేవారి చెవి కోసినా పాపం లేదు."

# ధైర్యంగా జీవించాలంటే?

నార్మన్ విన్‌సెంట్ పీల్

అతి సులభంగా ప్రతీ చిన్న విషయానికి దిగులుపడిపోతూ వాటిని శీఘ్రంగా నివారించుకోలేని సున్నితమైన నాజూకు స్వభావం



గలవారు తమకు తామే కాదు కుటుంబంలో సభ్యులకి, ఆప్తమిత్రులకి, సహచరులకి కూడా ఒక పెద్ద సమస్యగా తయారవుతున్నారు.

కొందరు తమ మనస్సులో కలిగే భావోద్రేకాలను అదుపులో పెట్టుకుని, అణచుకుని గ్రహించుకోలేక మీమాంసలతో, సంశయాలతో సతమతమైపోతూ ప్రగతి మార్గంలో ముందంజ వేయలేకుండా ఉన్నారని ఒక పెద్ద ఉత్పాదక సంస్థ యజమాని అభిప్రాయం వ్యక్తీకరించారు.

నిత్యజీవితంలో అడుగడుగునా ఏర్పడే ప్రతీ సంఘటనకు వైకల్యంతో క్రుంగిపోకుండా నిశ్చింతగా, హాయిగా ఉండడానికి సులభమార్గాలు :—

1. మనస్సుని ఇటువంటి బాధలు పొడచూపినప్పుడు, ఆలశ్యం చేయకుండా వెంటనే ఎంత శీఘ్రంగా వీలైతే అంత శీఘ్రంగా వీటిని పోగొట్టుకుని మనస్సును సరిచేసుకోడానికి ప్రయత్నించాలి. మనస్సును పరిశుభ్రంగా ఉంచుకోలేకపోతే అది చేసే చెరుపు ఇంతా అంతా కాదు. మనస్సులో గూడు

---

## తన 27 సంవత్సరాల జీవితంలో ఒకే గదిలో రెండోసారి నిద్రించనేలేదు!

246-210 బి.సి.లో మొట్టమొదటి చైనా చక్రవర్తి చిన్‌షిహువాంగ్-టి 10,000 గదులున్న తన రాజభవనంలో నివసిస్తూ ఒకే గదిలో రెండవసారి నిద్రించలేదు! చంద్రమండలానికి కూడా కనిపించే సుప్రసిద్ధ 1,500 మైళ్ళ నిడివి గల పెద్ద గోడను (great wall) నిర్మించిన ఈ చక్రవర్తి పేరు నుండే ఆ దేశానికి 'చైనా' అనే పేరు స్థిరపడింది. రాజమర్యాద సూచకమైన "వి" (we) అనే పదాన్ని మొట్టమొదట వాడిన చక్రవర్తి ఇతడు.

"పొరపాటు ఎప్పటికీ పొరపాటే,
ప్రమాణాలతో సమర్థించినా పరిహారం కాదు."

కట్టుకుపోయిన సమస్యలను పూర్తిగా తొలగించుకుని మనస్సును శుద్ధి చేసుకుని పదిలపరచుకోవాలి. దిగులుతో అంతులేని ఆలోచనలతో మునిగిపోవద్దు. ప్రయోజనకరమైన మార్గాన్ని అన్వేషించి అవలంబించు.

నీలో అనంతమైన శక్తి ఉంది. నీ అంతట నీవు దీనుడవు అయిపోకు. రోషంతో, ఆగ్రహంతో, ప్రతీకార భావంతో తబ్బిబ్బులు పడిపోవద్దు. మనస్సుకు బాధ కలిగించే విషయాన్ని వెలికి తీసి చికిత్స ప్రారంభించు. వ్రేలు కోసుకుపోయి రక్తం స్రవిస్తూ ఉంటే చూస్తూ ఊరుకుంటామా? సమయానికి తగిన చికిత్సాక్రమం చేపట్టక పోతే పరిస్థితులు విషమించి పోతాయి. కాబట్టి దివ్యౌషధంలా పనిచేసే ఆధ్యాత్మిక చింతనతో విషమ సమస్యలు పరిష్కరించుకోడానికి ప్రయత్నించు.

2. మనస్సులో చోటు చేసుకున్న ఉపద్రవ కాలుష్యాలను బయటకునెట్టి మనస్సును నిష్కల్మషం చేసుకో. మనస్సు తలుపులు మూసి పెట్టకుండా బాహాటంగా తెరచి ఉంచుకుంటే మానసిక సమస్యలు వాటంతటవే ఎగిరిపోతాయి. నీకు ఎవరిమీద అధిక విశ్వాసం ఉంటుందో వాళ్ళ దగ్గరికి వెళ్ళు. నీ కష్టాలను దాచుకోకుండా వెళ్ళబోసుకో. ఇక వాటిని గురించి పూర్తిగా మరచిపో.

3. ఎవరి వల్లనైతే నీకు బాధలు, ఉపద్రవాలు కలుగుతున్నాయని భ్రాంతి పడుతున్నావో వారికి నీ బాధలు వివరిస్తూ ఉత్తరం వ్రాయి. సంకోచం వద్దు. మాటలను మ్రింగివేయకుండా, విషయాలను గుప్తపరచకుండా పూర్తిగా వ్రాసి మడిచి కవరులో పెట్టి అతికించు. ఉత్తరాన్ని చింపి ముక్కలు చేయి. నీ ఉపద్రవ కారకులను క్షమించు. వారు అపరాధకులు అని అనుకుంటే మన్నించు. వారికి వివేకం వికసింప చేయమని దైవాన్ని ప్రార్థించు. భగవంతుని దయవల్ల మనస్సు శుభ్రపడిందని సంతోషించు, ఆనందపడు.

4. ఇంత బాధతో వ్యసనపడి పోవడానికి

---

## భారతదేశంలో ప్రాథమిక పాఠశాలలు




భారతదేశంలో 1951వ సం॥లో ఉన్న 2.09 లక్షల ప్రాథమిక పాఠశాలలు ఇప్పుడు 5.5 లక్షలకు పెరిగాయి. మిడిల్ స్కూళ్ళు 14,000 నుంచి సుమారు 1,40.000కి పెరిగాయి. ఉన్నత సెకండరీ పాఠశాలలు 7,000 నుండి 60,000 కు పెరిగాయి. ఇదే కాలంలో విశ్వవిద్యాలయాలు 5 రెట్లు, కళాశాలలు 7 రెట్లు పెరిగాయి.

(ఆధారం: యోజన)

"సత్యము, జ్ఞానము. ధర్మము, దయ, శాంతి, క్షమము ఈ ఆరే ఆప్తులైన బంధువులు."

కారణమేమిటి? అని తరిచి తరిచిచూచుకో - నిర్దాక్షిణ్యంగా, నిర్మోహమాటంగా నివారించమని సర్వరోగ హరుడైన పరమాత్మని ప్రార్థించు.

5. నిష్కపటంగా, న్యాయంగా నీ మనస్సును, భావాలను విశ్లేషించుకో. ప్రత్యేకమైన మానసిక బాధలో నీ బాధ్యత ఎంత ఉందో తూకం వేసుకో. నీ మటుకు నీవు సమగ్ర పరిశీలన చేసుకుంటూ శాంతిని అలవాటు చేసుకో.

6. ఈ దివ్య సూత్రావళిలో చివరిమెట్టు దైవప్రార్థన. భగవంతునికోసం పరితపించు. నీలో ఉత్పన్నమైన అసూయ, ద్వేషభావాలను, ఆగ్రహం, రోషం, ప్రతీకారం వంటి దుర్బీజాలను నశింపచేసుకో; నిశ్చలమైన మనస్సుతో భగవన్నామ స్మరణ చేసుకో.

"శరణం తవచరణం భవహరణం మమ గోవింద" అంటూ పరితపిస్తూ నీ అపకారికి వివేకం కలిగించమని దైవాన్ని ప్రార్థించు. అప్పుడే జీవితావస్థల ప్రయోజనం తెలిసి వస్తుంది. వాటి చరితార్థత గోచరిస్తుంది. మానసిక శాంతి లభిస్తుంది.

---

(36 వ పేజీ తరువాయి)

చెందిన కొన్ని చార్టులు ఇతర వివరాలు సహాయంతో భారతదేశం తూర్పు, పశ్చిమ తీరాలలో ఓడలు మునిగిపోయిన స్థలాలను గుర్తించారు. గోవా, మద్రాసు మరియు ఇతర ప్రదేశాలలో లభించిన చార్టులు సుమారు 1,000 కి పైగా పరిశోధించి 200 ఓడ ప్రమాదాలు జరిగిన స్థలాలను గుర్తించారు. వీటిలో 30 పెద్ద ప్రమాదాలు.

* *

**కొరియాలో 800 లక్షల సంవత్సరాల నాటి డినోసార్ పాదాలు**

సియోల్‌కి (కొరియా ద్వీపకల్పం) 300 కి.మీ. దక్షిణంగా కొహాయాన్ గ్రామంలో 800 లక్షల సంవత్సరాలనాటి డినోసార్ పాదాలను 400 దాకా చూచారు. 20 మొదలు 30 సెంటీమీటర్లుండే ఈ పెద్ద పెద్ద పాదాలు మూడుమూవులుండే డినోసారులకు చెందినవి.

* * *

**అపురూపమైన తాళపత్ర గ్రంథం కనుగొనబడింది:**

గాంగ్‌టాక్‌లోని సిక్కిమ్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టిబెటాలజీ ఒరియా లిపిలో శ్రీమద్భాగవత మహాపురాణం 9 వ స్కంధం సంస్కృత తాళపత్ర గ్రంథాన్ని కనుగొన్నారు.

* * *

**యు ఎ.ఇ.లో క్రొత్త నూనె క్షేత్రాలు:**

యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్‌లో రాస్ అల్‌ఖైమా అనే ప్రదేశంలో 'సాలిహ్' (Salih) నూనె క్షేత్రాలను కనుగొన్నారు. వీటివల్ల సుమారు 15 సంవత్సరాల పాటు రోజుకు 1,00,000 పీపాల నూనె ఉత్పత్తి అవుతుంది. ఈ నూనె క్షేత్రాలలో మొత్తం 2 000 లక్షల పీపాల క్రూడ్ (ముడినూనె) లభిస్తుంది.

---

"స్వల్ప అజాగ్రత్తవల్ల చేసిన మంచి పూర్తిగా చెడిపోతుంది."

# కలంస్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/-లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు.)

1. ఉమేష్ మహారాణా, S o ఎస్. ఎన్. మహారాణా, క్వార్టర్ నెం. ఎ/278, గాంధీగ్రామ్ పోస్టు, విశాఖపట్టణం-5.
కలం స్నేహం, ఫొటోగ్రఫీ, లైబ్రరీకి వెళ్ళడం.

2. బి. మహేష్, S/o బి. సత్యనారాయణ, క్లాత్ మర్చంట్స్, ములకల చెరువు, (చిత్తూరు జిల్లా) 517 390.
కలంస్నేహం, పుస్తకపఠనం.

3. ఎ. ప్రభాకరరావు, 19 సం.లు, బి.కామ్, S/o ఆనందరావు, వేములపూడి (నర్సీపట్నం తాలూకా).
ప్రకృతి ఆరాధన, కవిత్వం, కలం స్నేహం.

4. జి డేవిడ్. 24 సం.లు, బి.ఎ, బి.ఇడి, టీచరు, ప్రాథమిక పాఠశాల, కుందనపల్లి, ఘట్‌కేసర్ వయా (రంగారెడ్డి జిల్లా) 501 301.
కరాటే ప్రాక్టీస్, సినిమాలు చూడడం.

5 పి. నారాయణరావు 20 సం.లు, ఐ.టి.ఐ., S o పి. కిషన్‌రావు, జక్కేపల్లి, కూసుమంచి, (ఖమ్మం జిల్లా) 507 159.
కలంస్నేహం, పుస్తకాలు చదవడం, రేడియో వినడం.

6 జె. భాస్కర్‌రావు. 23 సం.లు, ఎమ్.బి.బి.యస్. మూడవ సంవత్సరం,

## ధ్వనిజనక వృక్షం



గయానాలో పెరిగే ఒక రకం చెట్లు విపరీతంగా శబ్దాన్ని ప్రసారం చేస్తాయి. వీటి కాయలు సిడుపాటి కాడలతో చెట్లకొమ్మల నుండి వ్రేలాడుతూ ఒకదాని కొకటి కొట్టుకొని ఫిరంగులు ప్రేలినట్టుగా పెద్ద పెద్ద ధ్వనులను ఉత్పాదిస్తాయి.

—'మిషా' సౌజన్యంతో

రూమ్ నెం. 1/4, కాకతీయ మెడికల్ కాలేజి, వరంగల్-506 007.

సంగీతం, గిటార్ వాయించడం.

**7.** జంతికా మోసెస్, 28 సం.లు, జ్ఞానోదయం, నెం. 122, స్టెర్లింగ్ రోడ్, నుంగంబాక్కం, మద్రాసు-600 034.

స్నేహం, ప్రకృతి ఆరాధన, ఫొటోలు తీయడం.

**8.** కె శ్రీరాములు, 23 సం. లు, (బి.ఏ.) S/o శ్రీ మారుతీరావు, ఇం. నెం. 3-3-54, కోటగల్లి పోస్టు మరియు తాలూకా బాన్సువాడ, (నిజామాబాద్ జిల్లా) 503 187.

(30 వ పేజీ తరువాయి)

యు థాంట్ (1909 1974) బర్మాలో ఉపాధ్యాయుడు, ప్రజాసేవకుడు. ఈతడు 1962 మొదలు 1971 వరకు యునైటెడ్ నేషన్స్ సెక్రటరీ జనరల్ పదవిని వహించాడు. టువర్డ్స్ ఎ న్యూ ఎడ్యుకేషన్ (Towards a New Education) డెమోక్రసీ ఇన్ స్కూల్స్ (Democracy in Schools) ఎక్కువ ప్రచారాన్ని పొందిన వీరి రచనలు.

* * *

హెరొడోటస్ (484-425 బి.సి.): చరిత్రకు పితామహుడు (Father of History). ప్రాచీన కాలంలో మధ్యధరా సముద్రం మీదుగా జరిగిన పెద్ద పెద్ద యుద్ధాలకు కారణాలను వివరించాడు.

కలంస్నేహం, ఫొటోగ్రఫీ, సినిమాలు చూడడం.

**9.** ఎమ్. నజీరు. 24 సం.లు, పోస్ట్ బాక్స్ నెం. 34, అల్ ఖాదాయి రస్తా, సౌది అరేబియా, కె.ఎస్.ఎ.

చదరంగం, క్యారమ్స్ ఆడటం, కలంస్నేహం.

**10.** డి. వి ఎస్. శాయిబాబు, 22 సం.లు, బి.ఏ. రెండవ సంవత్సరం విద్యార్థి, ఇం. నెం. 7-2-107, రికాబ్ బజార్, ఖమ్మం, 507 001.

ప్రకృతి ఆరాధన, పోస్టల్ స్టాంప్స్ సేకరించడం, కలంస్నేహం.

## దేవుని ముద్దుబిడ్డలు



క్రిక్కిరిసిపోయిన రైలు పెట్టెలను ఎన్నిటినో రైలు ఇంజను అతి సులభంగా లాగుతుంది. అదేవిధంగా భగవంతుణ్ణి భక్తి విశ్వాసంతో అంటిపెట్టుకున్న భక్తుల జీవితాలు ఏ ఒడుదుడుకులు లేకుండా నిశ్చింతగా వెళ్ళిపోతాయి. ఈ భక్తులు తమతోపాటు అందరినీ తీసుకెడతారు. —శ్రీరామకృష్ణ

"సానపట్టనిదే రత్నం ప్రకాశించని గులకరాయి."

# జాతీయ వార్తలు

## గత 7 సంవత్సరాలలో మొత్తం అటవీప్రదేశం 3 శాతం నశించంది

రిమోట్ సెన్సింగ్ విధానాలు మరియు సాటిలైటు సమాచారాల ద్వారా నేషనల్



రిమోట్ సెన్సింగ్ ఏజెన్సీ 1975 మరియు 1982 సం.ల మధ్య భారతదేశం అటవీ ప్రదేశంం 3 శాతం పోగొట్టుకొందని తెలియజేశారు. దేశం మొత్తం అటవీ ప్రదేశం 7 సం.లలో 5.5 లక్షల చ.కి. నుండి 4.5 లక్షల చ. కి. మీటర్లకు తగ్గి పోయింది.

## విశ్వసాహిత్య కోశం:

వారణాసిలో కాశీనాగి ప్రచారసభ 'విశ్వ సాహిత్య కోశాన్ని' సుమారు రూ. 30 లక్షల వ్యయంతో ప్రచురించడానికి ఉద్యమాలు కొనసాగిస్తున్నారు. ఈ విశ్వసాహిత్య కోశంలో ప్రపంచంలో ఉన్న అన్నిభాషలు ఉంటాయి.

* * *

## ఉత్తరప్రదేశ్‌లో ఆహార ధాన్యాల ఉత్పాదన రికార్డు స్థాయిని అందుకుంది:

ఉత్తరప్రదేశ్ 1984-85 సం. లో 31 మిలియను టన్నుల ఆహారధాన్యాలను ఉత్పాదించి క్రొత్తరికార్డు స్థాయిని అందుకుంది.

* * *

## కావలూరులో భారతదేశపు పెద్ద దూరదర్శిని :

ప్రపంచంలో అన్ని ప్రదేశాలకంటే తమిళనాడు కావలూరులో వాతావరణ పరిస్థి

## ఇళ్ళలో వాడే వంటచెరకు 150 మిలియను టన్నులు

భారతదేశం గ్రామాలలో నివసించే ప్రజలు ప్రతీ సంవత్సరం 1,400 మిలియను టన్నుల పశువుల పేడను ఇంధనంగా ఉపయోగిస్తారు. ప్రతీ సంవత్సరం వీరు 150 మిలియను టన్నుల వంటచెరకును కూడా ఇంధనంగా ఉపయోగిస్తున్నారని అంచనా వేయబడింది.

"నేను, నాది అను పాశములచే మానవుడు బద్ధుడగుచున్నాడు."

తులు ఎక్కువ అనుకూలవంతంగా ఉండటం చేత ఇక్కడ 50 మిలియన్ల వ్యయంతో అతి పెద్ద ఆప్టికల్ టెలిస్కోపు ఏర్పాటు చేయ దీనికి 2.34 మీటర్ల వ్యాసంగల పెద్ద అద్దం ఉంది కచ్చితంగా వస్తువులను ప్రతిబింబించే ఈ అద్దం 40 సెం.మీ దళ సరితో 3.5 టన్నుల భారం తూగుతుంది. పూర్తి టెలిస్కోపు సుమారు 100 టన్నులు భార ముంటుంది. రూ. 10 మిలియను ఖరీదుతో అమెరికానుంచి తెప్పించిన కంప్యూటరు దీనిని నియంత్రిస్తుంది.

* * *

## కె. జి. ఎఫ్. రూ. 15,820 కోట్ల విలువ గల బంగారాన్ని ఉత్పాదించింది:

కర్ణాటకలోని కోలార్ గోల్డు ఫీల్డ్సు ఇంత వరకు రూ. 15,820 కోట్ల విలువగల 790 టన్నుల బంగారాన్ని ఉత్పాదించింది. ఒక శతాబ్దంనుంచీ బంగారాన్ని ఉత్పాదిస్తున్న ఈ గనులలో రూ. 700 కోట్ల విలువగల 35 టన్నుల బంగారం మాత్రమే మిగిలింది.

* *

## పరిశోధకులకు సహకరించే విద్యాసంబంధమైన పురావస్తు శాల:

నేషనల్ కౌన్సిల్ ఆఫ్ ఎడ్యుకేషనల్ రీసెర్చి అండ్ ట్రెయినింగ్ (NCERT) విద్యా సంబంధమైన పురావస్తుశాలను (archives) ఏర్పాటు చేస్తున్నారు. దీంట్లో 1854 సం.నికి విద్యావిషయకంగా తీసుకున్న తీర్మానాలు, చేపట్టిన ప్రణాళికలు, వివిధ కమిషనుల రిపోర్టులు, ప్రభుత్వ చట్టాలు వగైరాలలో అన్ని సాధ్యమైన వివరాలు భద్రపరచబడతాయి.

* * *

## సూరజ్ 325 భారతదేశపు తొలి డీసెల్ మోటారు సైకిల్:

పంజాబ్ అమృత్‌సర్‌లో సూరజ్ ట్రాక్టర్స్ ప్రైవేట్ లిమిటెడ్‌వారు భారత దేశపు తొలి డీసెల్ మోటార్‌సైకిల్ సూరజ్ 325 కు ఇటలీ దేశానికి చెందిన లోంబార్డినీ ఇంజను అమర్చి అభివృద్ధిపరచారు. ఈ క్రొత్తవాహనం లీటరుకి 86 కి మీ ఇస్తుంది. ఇది దేశంలో ఇంధనపు పొదుపుకి అతి సామర్థ్యవంతమైన రెండు చక్రాలబండి. డీసెల్ ఇంజనులు చాలా దిట్టంగా ఉంటాయి కాబట్టి భారతీయ రహదారులకు ఇవి చాలా అనుకూలంగా ఉంటాయి.

## పట్టుపురుగుల పెంపకానికి క్రొత్త చెట్టు:

టుస్సార్ రకం పట్టుపురుగులను పెంచడానికి మల్బరీకి బదులుగా అర్జున్ వృక్షం చాలా అనుకూలవంతమైందని ఉత్తరప్రదేశ్ డివిజనల్ ఫారెస్ట్ ఆఫీసర్ ఆర్. పి. సింగ్ చెబుతున్నారు. ఇది చాలా చౌకగా లభించడమే గాకుండా పనికిరాని బీడు ప్రదేశాలలో కూడా బాగా పెరగడానికి అనుకూలంగా ఉంటుంది అంటున్నారు.

"మానవులకు శ్రద్ధయే జీవనము, అశ్రద్ధయే మరణము."

# సారస్ కొంగలు

కొంగజాతులలో మిక్కిలి పెద్దవి సారస్ కొంగలు. వీటి ఎత్తు 5 అడుగులు. ప్రపంచంలో ఇవి చాలా ఎత్తైన పక్షులు. ఈ పక్షులు సాధారణంగా భారతదేశం ఉత్తర మరియు మధ్య భాగపు వరి పొలాల



లోను, బర్మా, థాయ్‌లాండ్, ఫిలిప్పీన్స్ లోను ఎక్కువగా నివసిస్తాయి. ఉత్తర అమెరికాలో ఈ జాతి అంతరించి పోతున్నా, ఇక్కడ ఇంకా వృద్ధి పొందుతూంది. దీన్ని చంపడం మహా పాపం అని, దుశ్శకునం అని చాలామంది ఆసియాదేశపు ప్రజల మూఢ విశ్వాసం. అందువల్లనే ఇవి నిర్భయంగా గ్రామాలలో, పట్టణాలలో నివసించే ప్రజలతోపాటు సంచరిస్తూఉంటాయి.

శాకా సంబంధమైన పదార్థాలు, చిన్న చిన్న పురుగులు, నత్తలు, ప్రాకుడు జంతువులు మొదలైనవి వీటి ముఖ్య ఆహారం. పాములు, పంటలను నాశనం చేసే ఎలుకలు, అనేక రకాల కీటకాలను తింటూ పొలాలలో పంటలకు ఒక అపూర్వమైన రక్షణను ఇస్తాయి. అందుకే దీనిని మానవ మిత్రుడుగా భావిస్తారు. ఈ పక్షులను అతి సులభంగా మచ్చిక చేసి పెంచవచ్చు. దీని ముక్కు మిక్కిలి వాడిగా, నిడివిగా పెద్ద చాకులా ఉంటుంది. అతి గుప్తంగానూ, రహస్యంగాను ఉండే దీని గూటి దగ్గరకు వచ్చినవారిని ముక్కుతో పొడిచి చంపేస్తుంది. ఆదర్శ దాంపత్య జీవితానికి ప్రతీక

## 35 మిలియను హెక్టేరు మీటర్ల నీరు వ్యవసాయానికి వినియోగమవుతూంది

భారతదేశంలో నీటి వనరులనుండి లభించే మొత్తం సాలుసరి నీటి సదుపాయం 185 మిలియన్ హెక్టేరు మీటర్లు. దీంట్లో 135 భూతలం మీద నీటి వనరులకు చెందినవే. 50 మాత్రం భూగర్భ జలాశయాల నుండి లభిస్తున్నాయి. మనం ఇప్పుడు 40 మిలియను హెక్టేరు మీటర్ల నీటిని వినియోగించుకుంటున్నాము. దీంట్లో సుమారు 35 మి. హె. మీ. సాగుబడికి ఉపయోగపడితే 1.3 మి. హె. మీ. త్రాగడానికి ఉపయోగపడుతూంది.

అనే విశ్వాసంతో వీటిని భారతదేశంలో చాలామంది అతి గౌరవంతో పూజించి రక్షిస్తారు. దీనిఫలితంగా మానవులమీద వీటికి మంచి నమ్మకం ఏర్పడింది. జనాన్ని చూస్తే వీటికి బెదురుండదు. సారస్ కొంగల ప్రణయ నృత్యం ఎంతో వినోదకరంగానూ, ఆహ్లాదకరంగానూ ఉంటుంది. భారతదేశంలో పక్షుల పరిశీలకులకు ఇదొక అపూర్వ దృశ్యం. అమితానందం కలిగిస్తుంది.

నిడుపాటి పెద్ద రెక్కలను విప్పారించి మెడవంచి పరస్పరం ఒకదానిచుట్టూ ఒకటి ప్రదక్షిణాలు చేసుకుంటాయి. మగది, ఆడది జతగా కూడి ఉంటాయి. వీటి పరస్పర అనురాగం, ప్రేమ లోకప్రసిద్ధి. ఒక జతలో ఏ ఒక్కటైనా ఏ కారణం చేతైనా మరణిస్తే రెండవది మరణం సంభవించిన ప్రదేశాన్ని అనేక వారాలపాటు క్రమంగా సందర్శించి దుఃఖిస్తుంది. బ్రతికి ఉన్న మగపక్షి విరహబాధ ఓర్వలేక నిరాహారంతో కృంగి కృశించి స్వచ్ఛంద మరణాన్ని పొందుతుంది.

రాజస్థాన్ గానా (Ghana) లో నిసుప్రసిద్ధ వాటర్‌బర్డ్ సాంక్చుయరీ (Water bird sanctuary) లోను దాని చుట్టుపట్ల ఈ కొంగలు ఎక్కువగా కనిపిస్తాయి. ఇవి గ్రుడ్లను మగ, ఆడ పక్షులు రెండు సమాన బాధ్యతతో పొదుగుతూంటాయి. పొదగబడిన గ్రుడ్లనుంచి వచ్చిన చిన్న కొంగ పిల్లలు వెంటనే నడవడానికి ప్రారంభిస్తాయి. మరి నాలుగు నెలల తరువాత ఎగరడానికి ప్రయత్నిస్తాయి. రెండవ సంవత్సరంలో రెక్కలు బాగా పెరుగుతాయి. పెరిగి పెద్దవి అవుతాయి.

## తొలి వజ్రం 1866 వ సం.లో కనుగొనబడింది



ప్రపంచంలో తొలి వజ్రం 1866 వ సం. లో దక్షిణ ఆఫ్రికాలో కింబర్లీకి దక్షిణంగా కనుగొనబడింది. 1869 మరియు 1870 సం. లలో మొట్టమొదట కింబర్లీ దగ్గరే ఎన్నో వజ్రాలను కనుగొన్నారు. ఇంతవరకు కనుగొనబడిన 33 పెద్ద పెద్ద వజ్రాలలో 17 దక్షిణ ఆఫ్రికాలో కనుగొనబడ్డవే. బ్రహ్మాండమైన 82½ క్యారెట్ల 'స్టార్ ఆఫ్ సౌత్ ఆఫ్రికా'ను హోప్‌టౌన్‌లో త్రవ్వితీసారు. అనేక మిలియన్ల రూపాయల విలువగల దీనిని సంపాదించినది స్చాక్ వాన్ నికెర్క్ (Schalk van Niekerk). హోప్‌టౌన్‌లో విలీన్‌పెల్డ్ సోదరులు స్చాక్ నుండి దీనిని కొని ఇంగ్లాండులో ఎర్ల్ ఆఫ్ డడ్లీకి అమ్మారు.

# ప్రపంచ వార్తలు

## ప్రపంచంలో మిక్కిలి లోతైన బిలం:

పశ్చిమ జర్మనీలో ఆచెన్-కొలాన్‌ల మధ్య ప్రపంచంలోనే మిక్కిలి లోతైన పెద్దగొయ్యిని త్రవ్వుతున్నారు. సుమారు 10,000 హెక్టేరుల పైశాల్యంగల భూప్రదేశం 2000 సంవత్సరం నాటికి 500 మీటర్ల లోతుగా త్రవ్వబడుతుంది. ఓపన్ కాస్ట్ విధానంలో గనులనుండి లిగ్నైటును త్రవ్వే ప్రాజెక్టుక్రింద ఈ కార్యక్రమం జరుగుతూంది.

* * *

## సిగ్నల్స్ లేకుండా రైలుదారి:

సోవియెట్ ఇంజనీర్లు సిగ్నల్స్ లేకుండానే రైలుదారిని నిర్మించగలిగారు. స్టేషన్‌లో ఏర్పరచిన ఆటోమేటిక్ విధానం సహాయంతో రైలుబండిలో ఉన్న సిగ్నలులు నియంత్రింపబడతాయి. ఎండ వాన ఇతర వాతావరణ పరిస్థితులతో నిమిత్తం లేకుండా ఇనుపకమ్మి Rails ల ద్వారా ఇంజన్ పెట్టెలో డ్రైవరుకి వార్నింగ్‌లైట్ సిగ్నలులు అందుతాయి. ఈ విధానం విశ్వసనీయంగా ఉండడమేగాక ఎలక్ట్రిక్ తీగలు, స్తంభాలు, సాంప్రదాయిక విధానపు సిగ్నల్‌లకు కావలసిన ఇతర పరికరాలు, వస్తువులు, నిర్మాణాలు అవసరం దీనికి ఉండదు. విద్యుచ్ఛక్తి కూడా చాలా కలిసివస్తుంది.

* * *

## ప్రపంచంలో మొట్టమొదటి జేబులో ఇమిడే కలర్ టీ. వీ:

జపాన్‌లో వాచీలను తయారుచేసే పెద్ద కంపెనీ సీకో - ఐదు సెం.ల లిక్విడ్ క్రిస్టల్ స్క్రీన్‌తో జేబులో ఇమిడే తొలి కలర్

## వందలాది మిలియన్ల మైళ్ళ పొడవైన తోకచుక్కలు



ధగధగ మెరిసిపోయే తోకలతో ప్రకాశించే తోక (వేగు) చుక్కలన్నీ ఖగోళ రాసులే. ఇవి సూర్యగోళాన్ని సమీపిస్తున్నకొద్దీ సూర్యుని వేడికి దుమ్ము, వాయువులు (gases) తో కూడిన తోకలను పెంచుకుంటాయి. వీటి తోకలు అనేక వందల మిలియనుల మైళ్ళ పొడవుగా ఉంటాయి.

"సత్తుని తెలిసికొనుటకై 'చిత్తు'ను ఆశ్రయించు."

టీ. వీ. ని అమ్మకానికి సిద్ధం చేశారు. బ్యాటరీతో పనిచేసే ఈ జేబు టీ. వీ. పరిమాణం 16 × 8 × 2.8 సెం.మీ. లు. బరువు 50 గ్రాములు. దీని ఖరీదు సుమారు రూ. 4,350 లు. నిరాటంకంగా 4 గంటలసేపు కలర్ ప్రోగ్రాం ఆనందంగా చూడవచ్చు.

## చైనాలో అధిక దిగుబడి వరి వంగడాలను ఉత్పాదించారు:

చైనాలో వ్యవసాయ శాస్త్రానికి చెందిన విజ్ఞాన శాస్త్రజ్ఞులు క్రొత్తజాతి అధిక దిగుబడి వరివంగడాలను శోధించి ఉత్పాదించారు. సాధారణంగా ఆసియా దేశాల ఉత్తమ తరగతికి చెందిన అధిక దిగుబడి వరికంటె 20 నుంచి 30 శాతం ఎక్కువ దిగుబడిని ఇచ్చే వరివంగడాలను అభివృద్ధిపరచారు. ఈ క్రొత్తజాతి శోధిత వంగడాలను కాలిఫోర్నియా (అమెరికా)లో పండించి అమెరికాలో సాధారణంగా పండించే వరికంటే 180 శాతం అధిక దిగుబడిని పొందారు.

## అత్యధిక జనసాంద్రతగల పట్టణాలు 10 కి 6 ఆసియాలోనే:

యునైటెడ్ నేషన్స్‌వారి సూచన ప్రకారం 2000 సంవత్సరం నాటికి అధికంగా జనాభాగల పట్టణాలు టోకియో, యోకహామా (జపాను), షాంగ్‌హై, బైజింగ్ (చైనా), గ్రేటర్ బొంబాయి, కలకత్తా ( ం), జకార్తా (ఇండోనేషియా), ఆసి ఉంటాయి.

## 1987 వ అంతర్జాతీయ సంవత్సరం నిరాశ్రితులకు:

1987 వ సంవత్సరం నివసించేందుకు

---

## సగటు భారతీయుని ఆహార వినియోగం అత్యల్పం



సగటు భారతీయుని ఆహార వినియోగం చాలా తక్కువ. సోవియెట్ దేశాలలో తమ 250 మిలియను జనాభాకి 250 మిలియను టన్నుల ఆహారం కావలసి ఉంటే భారత దేశంలో ఉండే 750 మిలియను జనాభాకి ఇక్కడ ఉత్పాదింపబడే 150 మిలియను టన్నుల ఆహార ధాన్యాలు ఎక్కువవుతున్నాయి! దీనికి ముఖ్య కారణం భారత దేశంలో తాండవిస్తున్న నికృష్ట దారిద్ర్యం, అతి తక్కువ కొనుగోలు శక్తి.

---

ఇళ్ళూ వాకిళ్ళూలేని నిరాశ్రితులకు (International year for the Homeless) ప్రత్యేకించబడినట్లుగా యునైటెడ్ నేషన్స్ ప్రకటించారు. కనీస సౌకర్యాలకు కూడా నోచుకోని పేదవారికి వసతి సౌకర్యాలు కలిగించి వారి పరిసరాలను ఆరోగ్యంగా అభివృద్ధిపరచడమే దీని ముఖ్య ఉద్దేశం.

* *

## క్రొత్తరకం కృత్రిమ హిప్ జాయింట్లు:

చైనాలో వైద్యులు క్రొత్త రకంగా కొబాల్టు క్రోమియం మోలిబిడినమ్ మిశ్రమంతో కృత్రిమ తుంటి కీళ్ళను అభివృద్ధి పరచారు. సాంప్రదాయికపు టిటానియం కో-క్రో-మా మిశ్రమంతో తయారయే జాయింట్లతో సరిపోలిస్తే ఈ క్రొత్త జాయింట్లు అమర్చడం చాలా సులభం. అమర్చడానికి బోన్ సిమెంటు అవసరం ఉండదు.

* * *

## శ్రమకు తగిన ప్రతిఫలం పొందని 75 మిలియను బాల కార్మికులు:

ఇంటర్నేషనల్ లేబర్ ఆర్గనైజేషన్ (ILO వారి అభిప్రాయం ప్రకారం ప్రపంచంలో 15 సంవత్సరాల వయస్సు లో బడిన 75 మిలియను బాల కార్మికులు అలిసిపోయి పని చేస్తున్నారు. వీరంతా తక్కువ జీత బత్తాల పనులలోనే ఉన్నారు.

---

## జీవితంలో విజయం అంటే?



అనేక సంవత్సరాలకు ముందు యునైటెడ్ స్టేట్స్‌లో రాల్ఫ్ వాల్డో ఎమర్సన్ అనే తాత్త్వికుడు ఉండేవాడు. జీవితంలో విజయం అంటే ఏమిటి? అని అడిగినప్పుడు అతడు "నవ్వు, పసిబిడ్డలను ప్రేమానురాగాలతో ఆదుకునే చిరునవ్వు, కపటస్నేహితుల కుతంత్రాలను సహించగల లాస్యం, ఇతరులలో సద్గుణాలను మాత్రమే గ్రహించి ఆనందాన్ని వెల్లివిరియజేసి ప్రపంచంలో మనుగడ నేర్పే నవ్వు, సాంఘిక వ్యవస్థలో అభివృద్ధిని కలిగించి నిత్యచైతన్యంతో ఆరోగ్యవంతంగా జీవింపజేసి, జీవితానికి ఒక సంపూర్ణమైన సంకేతనా సరళత కలిగించే సహనమే జీవితంలో అఖండ విజయం అనిపించుకుంటుంది" అన్నాడు.

"యోగి మనస్సునకు అధీనుడు కాడు;
మనస్సును తన అదీనమందుంచుకొనువాడు."

# బహుమతి పొందిన వ్యాసం

# త్యాగం - వినయం

ఎమ్. వేణుగోపాల్, మదనపల్లె.

జీవితాన్ని ఆనందమయం చేసుకోవడానికి అందరూ ప్రయత్నిస్తారు. ఐహికంగా గానీ, ఆముష్మికంగా గానీ ఆనంద లబ్ధికై త్యాగం వినయం ముఖ్యం. ఇతరుల శ్రేయస్సుకై స్వసుఖాన్ని త్యజించుకునే గుణం త్యాగం. ఎట్టి ప్రతిఫలం ఆశించకుండా పరులహితం కోరడం నిస్వార్థత్యాగం. అహంకార రహిత మైన గుణమే వినయం.

సమాజంలో వ్యక్తి తాను ఇతరులకు ఏ మాత్రం ఉపయోగపడకపోతే పరులుకూడా అతనికి సహాయం చేయరు. అందుచేత స్వార్థంకోసమైనా కొద్దిగా త్యాగగుణాన్ని అలవరచుకోడం సామాజిక మానవునికి ఆవశ్యకం. లేశమైనా త్యాగ గుణం లేకపోతే మానవ జీవితం వ్యర్థం.

తన కున్నంతలో, చేతనైనంతలో ఇతరులకు దానంచేసి, సేవచేసి ధర్మగుణం అలవరచుకుని త్యాగ స్వభావాన్ని పాటించమని అన్ని మతాలు చెబుతున్నాయి. మనిషి పురోగతికి అహంకార స్వభావం పెద్ద అవరోధం. అందుచేతనే అహంకారం పదులుకోమని పెద్దలు చెప్పారు.

## మతం వ్యక్తిగత సంబంధమైనది



మతం ప్రత్యేకంగా వ్యక్తిగతమైంది. మానవులు దీన్ని వ్యక్తిగతంగా తమకు చెందిన ఆవరణలో ఉంచుకోగలిగినట్లైతే మన రాజకీయ రంగం దివ్యంగా ప్రకాశిస్తుంది. ప్రభుత్వ కార్యాలయాలలో ఆయా ఉన్నతాధికారులు, ప్రజా సంస్థల అధికారులు చేరి దీక్షతో మతరహితమైన రాజ్యం కోసం పాటుపడితే నవభారతాన్ని నిర్మించ గలం. అదే ప్రపంచ సౌభాగ్యం.

—మహాత్మాగాంధీ

---

"ధ్యానముకంటె మనస్సును పవిత్రము చేయునది ఏదియులేదు."

అహాన్ని సంతృప్తిపరచడానికి మనిషి నానా అవస్థలు పడతాడు. అందుచేతనే గాంధీజీ ఆనందాన్ని పొందాలంటే మనిషి శూన్యస్థాయికి దిగి వెళ్ళాలని అభిప్రాయపడ్డారు. అసూయ, ద్వేషము, మాత్సర్యము మొదలైన దుష్టగుణాలు పోవడానికి వినయ స్వభావం ఎంతగానో దోహదకారి అవుతుంది.

*　　*　　*

జి. గురునాథ్ బాబు, ఆదోని.

త్యాగం అనేది వెలలేనిది; విలువైనది. అర్థం చేసుకుంటే తప్ప దాని ప్రాముఖ్యత తెలియదు. మానవ జీవితానికి సార్థకతను, సాఫల్యాన్ని ప్రసాదించేది త్యాగం మాత్రమే. ఎందరో దేశభక్తులు తమ ప్రాణాలను సైతం లెక్కచేయకుండా తమ జీవితాలనే త్యాగం చేసి ఉండకపోతే మనమీనాడు ఈ స్వేచ్ఛను పొందగలిగి ఉండేవారమా? త్యాగమనే దానికి అంతటి ప్రాధాన్యత లేకుంటే ఈనాడు మనం ఆ దేశ భక్తులను అమర వీరులుగా స్మరించగలవారమా! ఒక మనిషి కోసం మరొకరు తమ సర్వస్వాన్ని త్యాగం చేయడంలో ఎంతో ఆనందం ఉండకపోదు. మనిషికి అంతరంగ వ్యక్తిత్వాన్ని, ఆత్మానందాన్ని రూపొందించేది త్యాగం అయితే మనిషి బాహ్య పరివర్తననూ, సంస్కారాలనూ ప్రభావితం చేసేది 'వినయం'. వినయ విధేయతలు లేనివారిని మనుషులుగా పరిగణించం. 'కనకపు సింహాసనమున శునకమును కూర్చుండ బెట్టడం లాంటిది'. ఈనాడు అనేకమంది వీటికి అతీతంగా వ్యవహరిస్తూ సంఘంలో గౌరవ మర్యాదలకు నోచుకోవడం లేదనడంలో నిజం లేకపోలేదు.

విద్య లేకపోయినా వినయ విధేయతలు మనిషికి ఆల టును తీర్చగలవేమో। చదువు లేనివారి విషయంలో వినయ విధేయతల మాట ఎలా ఉన్నా చదువుకున్న ఎంతమంది తమ ప్రవర్తనలో వినయ విధేయతలకు ప్రముఖస్థానం కల్పిస్తున్నారు! 'త్యాగం - వినయం' రెండూ మనిషిని సంపూర్ణ వ్యక్తిత్వం గల వ్యక్తిగా తీర్చిదిద్దుతాయని అనడంలో అతిశయోక్తి ఏమాత్రం లేదు.

*　　*　　*

---

## భూమి తన కక్ష్యలో చేసే భ్రమణం



భూమి భ్రమణ వేగం నిమిషానికి 1,000 మైళ్ళు. భూమి తన కక్ష్యలో సూర్యుని చుట్టూ 365 రోజులలో 58,00,00,000 మైళ్ళు (గంటకు 66,250 మైళ్ళు) పరిభ్రమిస్తుంది. నిమిషానికి 1,000 మైళ్ళ వేగంతో భూమితోపాటు మనం తిరుగుతున్నామనేదే మనకు తెలియదు!

"గొప్పగా ఉండటం గొప్పదే కాని,
దయగలిగి ఉండటం ఇంకా గొప్పది." —రోజర్స్

ఎ. వాసుదేవశర్మ, సిద్ధిపేట.

మానవ సద్గుణసంపత్తిలో త్యాగం ఒకటి. త్యాగం అంటే తన వస్తువును ఇంకొకరికి ఇచ్చుట అని అర్థం. ఇలాంటి త్యాగంచేత మానవుడు అమృతత్త్వమును పొందుతున్నాడు. త్యాగంలో సాత్విక, రాజస, తామసాది భేదము లున్నాయి. అయినా త్యాగము జ్ఞానప్రదం. ఇదే లోభ నిర్మూలనకు ప్రధాన గుణము అని తెలియుచున్నది. పరోపకారమునకు అతి ముఖ్యమైన గుణం ఇదే.

వినయం మానవుని బుద్ధిపరిణతిని తెలియచేస్తుంది. వినయం అంటే అణకువ. అణకువ వలన మనస్సు ప్రశాంతత చెందుతుంది. ప్రశాంతత వలన విషయము స్పష్టంగా తెలుపుట గానీ, తెలియుటగానీ జరుగుతుంది. ఈ గుణములు లేని వ్యక్తిని అహంకారి అని అనవచ్చు.

విద్యాధ్యయనం చేయకోరు సచ్ఛిష్యునకు, దేశ పురోభివృద్ధిని కోరు రాజకీయవేత్తకు, క్రొత్తగా అత్తగారింటికి ప్రవేశించిన కోడలికి ఈ గుణం అమృత గుళిక వంటిది.

## దక్షిణ ఆఫ్రికా నీగ్రోల వర్ణ విచక్షణ




దక్షిణ ఆఫ్రికాలో 16 సం. వయస్సు దాటిన వారందరూ రిఫరెన్స్ పుస్తకం **(Reference Book)** పెట్టుకోవాలి. పోలీసు అధికారి ఎవరైనా, ఎప్పుడైనా అడిగినప్పుడు రిఫరెన్స్ పుస్తకం చూపెట్టకపోవడం క్రిమినల్ నేరం క్రింద పరిగణింపబడి 28 డాలర్లకు తక్కువ కాకుండా జుల్మానా వసూలు చేయబడుతుంది లేదా ఒక నెలరోజులకు తక్కువగాని కాలం కారాగార శిక్షను విధిస్తారు.

దక్షిణ ఆఫ్రికా కేప్‌టౌన్‌లో ఫుట్‌బ్రిడ్జిని దాటడానికి తెల్లజాతులు, నల్లజాతులు వేరు వేరు మార్గాలను అనుసరించి ...టాలేగాని ఒకే మార్గం గుండా ఇద్దరూ ఒకేసారి పోకూడదు. వీరు పరస్పరం ఒకరిని ఒకరు చూచుకోకూడదు. ఈ నిబంధనలను అతిక్రమించిన వారికి కారాగార శిక్ష విధింపబడుతుంది. ముందుగా అనుమతిని పొందితేనే తప్ప నల్లజాతివారు తెల్లవారితో చేరి హోటళ్ళలో సహపంక్తిగా కాఫీ త్రాగడం కూడా నేరమే.

—ప్రొఫెసర్ లెస్లీ రూబిన్

"పూజ్యభావముచే ఇతరులు శిరస్సు వంచుతావున నీవును శిరస్సు వంచుము."

# బోధనాపద్ధతులు

ఏదీ ఉపదేశించలేం అనేది వాస్తవమైన బోధనకు ప్రథమ సూత్రం. ఉపాధ్యాయుడు నేర్పే శిక్షకుడు కాదు. పని కల్పించే పై అధి



కారి కాదు. అతడు ఒక సహాయకుడు, దారిని చూపించే మార్గ దర్శకుడు మాత్రమే. ఆలోచన చెప్పడం మాత్రమే ఆదేశించడం కాదు అతనిధర్మం - విజ్ఞానాన్ని అబ్బించలేరు. తనంతట తాను విజ్ఞానాన్ని పొందే మార్గం సూచించగలరు.

మనస్సు ఎలా వృద్ధిపొందుతుందో గమనిస్తూ ఆ మార్గంలో ప్రవర్తింపచేయడం రెండవ సూత్రం. తల్లిదండ్రులు కోరినట్టుగా, ఉపాధ్యాయుడు అనుకునేటట్టుగా విద్యార్థిని మార్చడం కాదు. అది వట్టి అనాగరికం, మూఢ విశ్వాసం: వ్యక్తిగత స్వభావానుగుణంగా విద్యార్థి ప్రవృద్ధి పొందడానికి ప్రేరేపించి పొత్సహించాలి. కాని తమ పుత్రుడు ఇది చదువుకోవాలి, అది నేర్చుకోవాలి అని ముందుగానే పరిష్కరించడానికి ఏర్పాట్లు చేసుకోడం, లేక తమ పుత్రుడు గొప్ప ఇంజినీరు, డాక్టరు, ఐఏఎస్ అవాలని ముందుగానే నిర్ణయించుకోడం మంచిదికాదు.

ఈ విధంగా ఉండాలి అని నేర్పించడం కంటే దూరంగా ఉండే పరిస్థితిని అనుగుణంగా వినియోగించుకొని అభివృద్ధి పొందడానికి ప్రయత్నించటం మూడవ సూత్రం. గతమంతా మనకు పునాదివంటిది. వర్తమానమే స్థూలమైన సాధనం. జరుగబోయే భవిష్యత్తు మన లక్ష్యం, మన అత్యున్నత దశ. —శ్రీ అరవింద

---

(16 వ పేజీ తరువాయి)

మరణిస్తే మోసుకువెళ్ళడానికి వాహకులు రావడానికి భయపడుతున్నారు. ఈ భయంకరమైన వ్యాధి సోకిన 3 సంవత్సరాల వయస్సు గల చిన్న పిల్లలు అమెరికాలో ఉన్నారు. మత్తు మందులకు అలవాటుపడ్డ వారికి, వ్యభిచారులు మొదలైనవారికి ఉపయోగించిన ఇంజక్షన్ సూదులద్వారా ఇది వ్యాపిస్తుంది. వేడి నీటితో స్టెరిలైజ్‌చేసి శుభ్రపరచని సూదుల వాడకంవల్ల, వ్యాధి సోకిన చెడు రక్తాన్ని తెలియకుండా ఇతరుల శరీరంలోకి ఎక్కించినప్పుడు ఎయిడ్స్ వ్యాపిస్తుంది

ప్రపంచంలో పెద్ద పెద్ద వైద్యులు ప్రయత్నాలు పరిశోధనలు చేస్తున్నా ఇంత వరకూ దీన్ని నివారించే ఔషధం కనిపెట్టబడలేదు.

"నవ్వుతూ చేసిన పాపాలు ఏడుస్తూ అనుభవించక తప్పదు."

# వనితాలోకం

(తో)లు పర్సులు, సంచులు మొదలైన వస్తువులను నీరుల్లిపాయలతో సులభంగా శుభ్రం



చేయవచ్చు. ఒక ఉల్లిపాయను మధ్యకు రెండు ముక్కలుగా కోసి ఒక ముక్క తోలు మీద పెట్టి గట్టిగా రుద్ది చిన్న బట్టతో తుడిస్తే తోలు నిగనిగలాడుతుంటుంది.

*　　*　　*

వెచ్చని పాలలో ముంచిన బట్టతో తుడిచి తోలువస్తువుల మీది సిరామరకలను కష్టం లేకుండా పోగొట్టుకోవచ్చు.

*　　*　　*

ఎండిన నిమ్మ లేక ఆరంజి తొక్కలను కాల్చి వంట గదులలో వచ్చే దుర్వాసనలను సులభంగా పోగొట్టవచ్చు.

పదిహేను నిమిషాలపాటు నిమ్మకాయను వేడినీటిలో పడేసి ఉంచి రసం పిండుకుంటే రసం పూర్తిగా పిండుకోవచ్చు.

# ఎందుకు?

## ఎందుకు చంద్రుని ఒకే భాగం చూడగలం?

చంద్రుడు తనలో తాను అక్షంచుట్టూ బొంగరంలా తిరుగుతూ భూమిచుట్టూ తిరుగుతున్నప్పటికీ మనం చంద్రుని ఒక భాగం మాత్రమే చూడగలుగుతున్నాం ఎందుకు?

ఎందుకంటే చంద్రుడు ఒక్కసారి తనలో తిరగడం పూర్తి అవడంతోపాటే అంటే అదే కాలంతో భూమి చుట్టూకూడా పరిభ్రమించడం పూర్తి అవుతుంది. చంద్రగ్రహంలో చేరుకున్నామంటే మరొకళ్ళతో మాట్లాడలేం. భూమి వాతావరణంలో ప్రసరించినట్లు చంద్రగ్రహం వాతావరణంలో శబ్ద తరంగాలు ప్రసరించ లేవు. రేడియో, లేక టెలిఫోన్‌ద్వారా మాత్రమే వినగలుగుతాం.

"వెనుకటి తప్పులు మళ్ళీ చేయడం గాక
కొత్త తప్పులు చేయడాన్ని అనుభవమంటారు." -కాఫీన్

# నిజాలు-నిదర్శనాలు

## భారతదేశంలో 211 వన్యమృగ సంరక్షక వనాలు :

భారత దేశంలో అంతరించి పోతున్న వన్యమృగాలను సంరక్షించడానికి 80,300 చ.కి.మీ. వైశాల్యంతో 211 సాంక్చుయరీలు



ఏర్పాటు చేసారు. ఇవేగాకుండా గత కొన్ని దశాబ్దాలల నిర్మించబడిన 20 నేషనల్ పార్కుల అంతరించి పోతున్న వన్యమృగాలకు పునరావాసం కల్పిస్తాయి. మొత్తం 211 సాంక్చుయరీలలోను 7 పూర్తిగా పక్షులకు కేటాయించబడ్డ బర్డ్ సాంక్చుయరీలు. 13 సాంక్చుయరీలలో మొసళ్ళకు, గారియల్‌లకు ప్రాజెక్టులు ఎర్పాటు చేశారు. మొత్తం 26 సాంక్చుయరీలతో హిమాచల ప్రదేశ్ ప్రథమ స్థానాన్ని అలంకరిస్తుంది. మధ్య ప్రదేశ్‌లో 22, బీహార్ మరియు ఒరిస్సాలో 17 సాంక్చుయరీలు ఉన్నాయి.

* * *

## జపానులో 98.9 శాతం ప్రజలకు కలర్ టీ.వీ.లు:

జపాన్‌లో కార్లుగల కుటుంబాలు 1970

## భావపరిచయపోటీ

(ఏప్రిల్ 1986)

"నేటి కృషి రేపటి భవిష్యత్తు
నేటి భోగం రేపటి యోగం."

—మంగిపూడి మాధవుడు, కాకినాడ.

* * *

"విద్య యొసగును 'వినయము',
మద్య మొసగును 'విషాదము'."

—బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్,
(ఆదిలాబాద్ జిల్లా)

* * *

ప్రస్తుత కాలాన్ని సద్వినియోగం
చేసుకోకపోతే
తర్వాత కాలంలో చింతించి ఫలంలేదు.

—ఎ.కె. గిరిధర్, గూడూరు,

"వందలు, వేలు, గురువులు దొరుకుదురు కాని,
శిష్యులు దొరుకుట దుర్లభం."

సం.లో 17 శాతం నేడు 62 శాతానికి పెరిగింది. కలర్ టీ.వీ. గల కుటుంబాలు 26 శాతంనుంచి 98.9 శాతానికి పెరిగింది. ఎయిర్ కండిషన్ సౌకర్యాలు గల కుటుంబాలు 5.9 శాతం నుండి 40 శాతానికి పెరిగింది. వీడియో రికార్డులూ, పియానోలు సర్వసాధారణ మయిపోయాయి. జపానులో సామాన్య కుటుంబాల మొత్తం ఆదాయంలో 27.5 శాతం, అమెరికనులు 16.2 శాతం ఆహారం క్రింద ఖర్చుచేస్తారు. నివాసాలకు మొత్తం ఆదాయంలో అమెరికా 15 శాతం, జపాను 5 శాతం ఖర్చు చేస్తారు.

* * *

## చైనాలో 70 శాతం దంపతులు సంతాన నిరోధాన్ని అవలంబిస్తున్నారు:

చైనాలో పుట్టుకల రేటు పడిపోవడానికి ముఖ్య కారణం - భారతదేశంలో బిడ్డలు కనే వయస్సు కలవారు 23 శాతం మాత్రమే సంతాన నిరోధాన్ని అవలంబిస్తే, చైనాలో 70 శాతం మంది అవలంబిస్తున్నారు.

## అణుకేంద్రాలనుంచి 2.5 శాతం విద్యుచ్ఛక్తి ఉత్పాదన:

భారతదేశం ప్రస్తుతం అణుకేంద్రాల నుంచి 2.5 శాతం విద్యుచ్ఛక్తిని ఉత్పాదించుకుంటోంది. అణుకేంద్రాల నుంచి ప్రపంచంలో ఉత్పత్తి కాబడే విద్యుచ్ఛక్తి మొత్తం 9 శాతం. ఫ్రాన్స్‌దేశం తన విద్యుచ్ఛక్తిలో 37.7 శాతం అణుకేంద్రాల నుండి ఉత్పాదించుకుంటూంది. ఫిన్‌లాండ్ 35.7 శాతం, స్వీడెన్ 35.3 శాతం, స్విట్జర్‌లాండ్ 28.1 శాతం, బెల్జియం 25.3 శాతం, బల్గేరియా 24.7 శాతం అణు విద్యుచ్ఛక్తిని ఉత్పాదించుకుంటున్నాయి.

* * *

## భారతదేశంలో 62.7 మిలియను గొడగేదెలు



యునైటెడ్ నేషన్స్ ఫుడ్ అండ్ అగ్రికల్చర్ ఆర్గనైజేషన్‌వారి లెక్కల ప్రకారం 62.7 మిలియను గొడిగేదెలతో భారతదేశం ప్రథమ స్థానాన్ని పొందితే తరువాత వరుసగా చైనా 18.75 మిలియను, పాకిస్థాన్ 12.2 మిలియను, థాయ్‌లాండ్ 6.4 మిలియనులతో రెండవ, మూడవ, నాల్గవ స్థానాలను ఆక్రమిస్తున్నాయి. గొడిగేదెలు ఎరువు కర్మాగారాల వంటివి. ఒక్కొక్కటి సం.కి. 6,800 కి.గ్రా. పేడను విసర్జిస్తాయి.

"ఉపాయం లేని పురుష ప్రయత్నం ధన సంపాదనకు సహాయపడదు."

## ప్రైవేటు రంగాలలో 1,890 కంప్యూటర్లు:



భారతదేశంలో ఇటీవల జరిపిన కంప్యూటర్ల సర్వేలో ప్రైవేట్ రంగాలలో 1,890 కంప్యూటర్లు. ప్రభుత్వ రంగంలో 290, కేంద్ర ప్రభుత్వ సంస్థలలో 520, రాష్ట్ర ప్రభుత్వ సంస్థలలో 164 కంప్యూటర్లు ఉన్నట్టు తేలింది.

* * *

## భారతదేశంలో 60,000 లక్షల టన్నుల మట్టి నష్టం:

ప్రతీ సంవత్సరం భారతదేశంలో భూతలం మీద 60.000 లక్షల టన్నుల మన్ను ఒరుసుకు పోతూంది. దీని ఫలితంగా సగటు భూసార నష్టం 60 లక్షల టన్నులు. ఆహారపదార్థాల రీత్యా చూస్తే ఈ నష్టం 360 లక్షల టన్నులు.

* * *

## ఆయుఃప్రమాణం 57.7 సం.లకు పెరిగింది:

భూతలంమీద జనాభా 'వృద్ధాప్యం' పెరుగుతూంది అని యు.ఎన్. లెక్కలవల్ల తేలింది. 1950-55 లో ఉన్న 47 సగటు ఆయుఃప్రమాణం 1975-80 లో 57.7 సంవత్సరాలకు పెరిగింది. 1950 సం.లో 60 సం. వయస్సుకు పైబడినవారు 2000 లక్షలమందే. 1975 లో ఈ సంఖ్య 3,500 లక్షలు. 2000 నాటికి ఇది 5,900 లక్షలకు పెరుగుతుంది.

## సూక్తిచిత్రవ్యాప్తి

(ఏప్రిల్ 1986)

"భారత జాతికి వన్నె తెచ్చిన
వేదాంత విజ్ఞాన ఖని."

—ఎ. గీతాంజలి, మచిలీపట్నం

* * *

"మనుషు లెందరో కాని
మహాత్ములు కొందరే."

—ఆర్. మధుమోహనరెడ్డి. మస్తూరు,
(చిత్తూరు జిల్లా)

* * *

"మతములన్ని మాసిపోవును
జ్ఞానమొక్కటే నిలిచి వెలుగును."

—అనీల్ కులకర్ణి, సిద్ధిపేట,
(మెదక్ జిల్లా)

---

"ప్రపంచంలో ఇది కష్టం, ఇది సుఖం అంటూ ప్రత్యేకంగా ఏదీ లేదు. నీ వాంఛలకు అనుకూల పరిస్థితులు సుఖాలుగా, ప్రతికూల పరిస్థితులు కష్టాలుగా భాసిస్తాయి."

# సైన్స్ లైట్

## కావలూరు దూరదర్శిని ఆసియాలోనే మిక్కిలి పెద్దది

తమిళనాడు ఉత్తర ఆర్కాటు జిల్లాలో వానియంబాడికి 30 కి.మీ. దూరంలో జవ్వాది కొండలమీద కావలూరులో ఏర్పాటు



చేసిన దూరదర్శిని ఆసియాదేశంలోనే మిక్కిలి పెద్దది. అన్ని ఉపకరణాలతోనూ మొత్తం 120 టన్నుల భారం తూగే ఈ దూరదర్శిని వ్యాసం 2.34 మీటర్లు.

కావలూరు దూరదర్శినిలో కనిపించే బింబం సహజంగా మన సాధారణ కంటికి కనిపించే బింబాన్ని 20 రెట్లు పెద్దది చేస్తుంది. ఇంతవరకూ ఉన్న దూరదర్శినులు వస్తువును 15 రెట్లు మాత్రమే పెద్దవి చేసి చూపించగలుగుతున్నాయి. ఈ దూరదర్శినితో ఖగోళరాసులను తక్కువ ఉరవడితో (drift) 6 గంటలసేపు అంతకు పైబడి కూడా పరిశీలించడానికి వీలు కలుగుతుంది.

ఇది 21 మీ. వ్యాసం, 250 టన్నుల భారం ఉండే పెద్ద అర్ధగోళపు డోములో అమర్చబడింది. ఈ అర్ధగోళం డోములో 4.5 మీటర్ల వైశాల్యం గల పెద్ద ద్వారం ఒకటి ఉంది. దీని రిఫ్లెక్టరు సుమారు 4 టన్నుల భారం ఉంటుంది. దూరదర్శిని తిరుగుతుంటే దాంతోపాటు డోము, విండ్

(మిగతా 62 వ పేజీలో)

## సుప్రసిద్ధ రచయితగా మారిన ఉద్యోగ భ్రష్టుడు!

అమెరికా వాస్తవ్యుడైన నెథేనియల్ హాథార్న్ తన ప్రభుత్వోద్యోగాన్ని పోగొట్టుకుని విచారంతో ఇంటికి చేరుకున్నాడు. అతడి భార్య తిట్టి సాధించడానికి బదులు బల్లమీద కలం, సిరాబుడ్డి పెట్టి భర్త భుజాలమీద రెండు చేతులుపెట్టి 'ఇక నీ గ్రంథాన్ని నువ్వు వ్రాయగలవు' అంది. హాథార్న్ గ్రంథం వ్రాయడానికి ప్రారంభించి 'ది స్కార్లెట్ లెటర్' అనే నవలను పూర్తి చేసాడు. గొప్ప రచయితగా అంతర్జాతీయ ప్రఖ్యాతిని పొందాడు.

"ఎరువు పుస్తకం వల్ల కలిగే ఆనందం బహుస్వల్పం."

(8 వ పేజీ తరువాయి)

టప్పుడు విటమినులు నశించకుండా క్రింది సూచనలను అనుసరించండి—

1. ఎప్పుడూ తాజా ఆకుకూరలనే వాడాలి.

2. ఆకులను ఎండలో ఎండనీయవద్దు. ఎండబెట్టడంవల్ల కెరోటిన్ నశిస్తుంది.

3. కూరలను తరుగుటకు ముందే శుభ్రంగా నీటితో కడగాలి. తరిగిన తరువాత కడుగకూడదు.

4. ఆకుకూరలను ఎక్కువ నీటిలో పెట్టి బాగా ఉడికించి ఆ నీటిని పారపోయకూడదు.

5. కూరలు ఉడకబెట్టేటప్పుడు పాత్ర మూసి ఉంచడం మంచిది. దీనివల్ల విటమిను 'సి' నశించదు.

6. 15 నిమిషాలకంటే అధికంగా కూరలను ఉడకపెట్టవద్దు. ఉడికిన వెంటనే వాడడం ఉత్తమం.

7. కూరలను సాధ్యమైనంతవరకు వేయించవద్దు.

శరీరపోషకానికి అత్యవసరమైన విటమినుల ప్రాముఖ్యతను మనం గమనించాలి. తగినంత తాజాకూరలు, పొట్టు పూర్తిగా తీయని ధాన్యం, పాలు నిత్యం ఉపయోగించడంవల్ల ఆరోగ్యాన్ని కాపాడుకుని, దీర కాలం జీవించగలుగుతాం.

(2 వ పేజీ తరువాయి)

మనస్సు. మనస్సులో బయలుదేరే ఈ కలుపును తీసి నిష్కల్మషమైన వివేకాన్ని సాధించి, మనస్సును స్వాధీనం చేసుకో. భ్రమను కలిగించే మమకారాలను మనస్సులోకి రానీయకు

నీ మనస్సులో చెలరేగి విజృంభించే శత్రువులను పూర్తిగా అణచుకోకుండా పొందిన బాహ్య విజయాలు శాశ్వత విజయాలు కావు. నీ లోపలి శక్తులు నీ అధీనంలో లేకపోతే నీ జీవితం నిరుపయోగకరం. బుద్ధి అడ్డదారులు తొక్కుతుంది.

ఎంత కష్టపడిఎన్నికష్టాలకైనా ఓర్చి నీ సర్వావయవాలను స్వాధీనంలో ఉంచుకొవచ్చునేమోగాని మనస్సును స్వాధీనంలో ఉంచుకోడం దుర్లభం; దుస్సాధ్యం నిన్ను అధః పాతాళానికి నెట్టినా. కొండపైకి ఎత్తినా నీ మనస్సే నీకు కారణం అని తెలుసుకో

బుద్ధి ప్రాబల్యంతో ఆత్మోపలబ్ధిని పరమ లక్ష్యంగా సాధించు అప్పుడు నిన్ను నీవు జయించినవాడ వవుతావు. జీవితాన్ని సరైన మార్గంలో మలచుకోగలుగుతావు పైపైకి పోయి జీవితంలో ఉన్నత శిఖరాలను అధిష్టించ గలుగుతావు.

నీలో నవచైతన్యంతో పుట్టిన ఉత్సాహం ఆత్మశక్తికి ఉద్దీపన కలిగిస్తుంది. కార్యాచరణలో కుశలత, నిపుణత ప్రకటితమవుతాయి. అప్పుడే నీవు కర్మవీరుడవు కాగలవు. వివేకం, ధైర్యం. నిగ్రహం. నిష్ఠ మొదలైన ఉత్తమ గుణాలు పట్టుబడతాయి నీ జీవితం శోభాయమానంగా, ఆనందమయంగా ఉంటుంది.

"సర్వసమదృష్టియే వేదాంత నీతి సారాంశము."

# పోటీలు

(జూన్ 1986)

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొనవచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు తావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీ మీదా అడ్రసు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటే ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రూ. 10 లు, రూ. 7 లు, రూ. 5 లు ఖరీదుచేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీలయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: జూన్ 20, 1986. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు 'విస్డమ్', 9, దేశికారోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

"మారుతూన్న మహిళలు - పురుషుల బాధ్యతలు" అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. చండీఘర్‌కు బదులుగా హర్యానాకు చెందవలసిన పంజాబులోని హిందీ మాట్లాడుకునే ప్రదేశాలనునిర్ణయించడానికి ప్రభుత్వం వారు ఏర్పరచిన కమిషనుకు అధికారి ఎవరు?

2. జూన్ 23, 1985న ఐరిష్ తీర ప్రదేశంలో అట్లాంటిక్ మహాసముద్రంలో కూలిపోయిన ఎయిర్ ఇండియా విమానం పేరు ఏమిటి?

3. ఫిలిప్పైన్ రాజధానీ నగరం ఏది?

4. ఇంటగ్రల్ కోచ్‌ఫ్యాక్టరీ ఎక్కడ ఉంది?

5. జూన్ 1985వ సంవత్సరంలో పెప్సి

"మనము అసలు వస్తువుకు బదులు
దాని నీడనే చూస్తున్నాము - అదే మాయ."

ఆఫ్ ఇండియాను ఏర్పాటు చేసిన డు విదేశాలు ఏవి?

6. హేగ్‌లోని అంతర్జాతీయ న్యాయ ారణ సంఘానికి చెందిన భారతీయ అధ్య షు ఎవరు?

7. "సారే జహాన్‌సే అచ్ఛా హిందూస్థాన్ మారా" అనే పాట రచించిన దెవరు?

8. 'హెవీ వాటర్' దేనికి ఉపయోగిస్తారు? ) మృదుపానీయాల తయారీకి, (బి) ామిక్ రియాక్టర్లకు, (సి) కారు బాటరీ స, (డి) హాస్పిటళ్ళలో త్రాగుటకు.

## పజిల్

ఆధారాలు-అడ్డం: 1. దివ్యనామ ంకీర్తనం చేయుటకు అనువుగా త్యాగ జు ఒక కీర్తనం అమర్చిన పల్లవి (జయ మ సీతారాం జయ), 6. బ్రెడ్-బట్టర్, ప్పు-నెయ్యి అనే మాటలలో వలెనే ప్పుడూ సిరాబుడ్డితో ఉంటూ వ్రాతకు పయోగపడే సాధనం, 7. ఐహికములు నివి చెదిరిపోతే, 9. అమూల్యమైనది ంచిన పోరకదు, 10. కాన్వాస్, టార్పా న్ మొదలైన వాటితో తాత్కాలికంగా వసించడానికిగాని, సర్కసులు, సినీమాలు ర్శించడానికిగాని ఏర్పరచిన సౌకర్యం ిముందు 'త్రిప్పు' అనే పదం చేరింది, . భూత భవిష్యద్వర్తమాన కాలాల్లో పయుక్తమై అదియే ధర్మముగా గలది' 13. వృక్షములు పూచిన పువ్వులు ఫలదీక రించుటకు సహకరించు కీటకజాతికి చెందినది, 14. ఉమాపతి, రమాపతి కాదు.

నిలువు 1. జనకమహారాజు కుమార్తె సీతతో కూడిన రామ, 2. జీవితంలో చేపట్టిన కార్యాలలో కాని, యుద్ధాలం కాని సాధించేది, 3. తొలిచూలు సంరక్షణార్థము 4,6 లేక 8 వ నెలలో చేయునట్టి విశేషము,



4. గొర్రె మొదలగు వాటి బొచ్చుతో నేయ బడిన శాలువ వంటిది 5. "గ్రీసు దేశపు జనులు" అను మాటకు తెలుగులో చెప్పేడి మాట, 7. అడ్డు 7 లో చెప్పిన పరలోక మున కలుగునట్టి వాటికి మరోమాట చెదిరిన తరువాత చివర 'ము' కారం కూడా చేరింది, 8. నానా విషయ సంగ్రహము అనుటకు సాధారణంగా తెలుగులో వాడే జాతీయము, 11. సాధారణంగా డిసెంబరు - జనవరి మాసాలలో విస్తారంగా పూసే అందమైన

"ప్రతీది భగవంతుని ప్రకటిత రూపమని మనకు అనుభవం కలిగినప్పుడు అందరిలో ఒక ఆత్మ ఉన్నట్టు గోచరించును."

పసుపు పచ్చని పుష్పం, తెలుగువారి స్వంతం అనుకోవచ్చు.

# తెలివికిపరీక్ష

1. క్రింది వరుసలో భాషా శాస్త్రప్రకారం పొసగని వాక్యమేది?

(ఎ) అతను వేంకటేశ్వర్లు

(బి) ఆ అమ్మాయి అందమైనది.

(సి) ఈమె అన్నం వండినది

(డి) అది ఎర్రగుర్రం

2. ఈ క్రింద సూచించిన తెలుగు చాటువు ఎరువు తెచ్చుకున్న పదాలను సూచించండి:

పూజారి వారి కోడలు

తాజాఁగ బిందె జారి దబ్బున బడియెన్

మైజారు కొంగు దడిసిన

బజారే తిరిగి చూచి పక్కున నవ్వెన్.

3. తిరుమలలో శ్రీవేంకటేశ్వరస్వామి వారి సాక్షాత్కారం పొంది తాళ్ళపాక అన్నమాచార్యులు శ్రీస్వామివారి హస్తములను వర్ణిస్తూ చెప్పిన పదంలో పల్లవి:

"ఇందరికి నభయంబు లిచ్చుచేయి

కందువలగు మంచి బంగారు చేయి"

ఇదేవిధంగా అన్నమాచార్యులు శ్రీస్వామి వారి పాదములను గురించి చెప్పిన పదంలో పల్లవిని చెప్పండి.

4. "ములవానరజ్మచసగో" యందు చెప్పను తలంపను శక్యము కానిది ఏది!

5. అష్టాంగ ప్రణామ విశేషంలో గల ఎనిమిది అంగము లేవి?

6. ఈ క్రింది అర్థాలను కలిగిన తెలుగు ఉర్దూ పదాలను వ్రాయండి.

(ఎ) తిరిగి వ్రాసినది. (బి) గుర్తు, (సి) బహుమానం, (డి) వ్రాసేవాడు.

7. ఈ వరుసలో తప్పిపోయిన సంఖ్యను వ్రాయండి.

1,4,9,16.25___49.

విసడమ్
పోటీల కూపను
జూన్ 1986

# మాటలమహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/ అర్థాలను గుర్తించండి.

1. అప్పనః స్వచ్ఛమైనది (ఎ) ఇచ్చుట (బి), కానుక (సి), అనుమతి(డి)

2. అప్పు సరికానిది (ఎ), జలము(బి) భ్రాంతి (సి), రుణము (డి).

3. అలమట: శ్రమము (ఎ), దుఃఖము (బి). దురవస్థ (సి), శ్రమజలము (డి)

4. అడటు: వస్తువులను కొదువ ఉంచుట (ఎ), అడ్డకట్టు (బి) ఆక్రమించు (సి), సుంకము (డి).

5. ఉద్ది: ఉజ్జి (ఎ),మినువ(బి), సమానము (సి), ఎదిరం (డి).

6. పరాకు: తత్పరత (ఎ), ప్రమాదము(బి), పరాధీనము (సి), ఆవరించు(డి).

"కీర్తి, పుణ్యముల చేతనే కలుగుచున్నది కాని, యోగ్యత చేతకాదు.'

## విసడమ్
## పోటీల సూపను
## జూన్ 1986

7. తాళిక: ఓర్పు (ఎ), క్షమము(బి), కము (సి). హారవిశేషము (డి.)
8. నామూషీ: పిరికితనము (ఎ), అధి క్యము (బి), అవమానము (సి), అధి (డి).

## విచిత్ర

అరు మాటలకు మించకుండా ఈ సంచిక ఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే సంఘటనను గురించి అయినా ఒకటి డు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్యా సి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రూ. ౦. ఖరీదు చేసే పుస్తకం బహుమతి!

## మీరైతే...?

"జీవితంలో సమరసస్థితి ఏర్పడా పీ!" మీరు ఏం చేస్తారు? క్లుప్తంగా 'కారంగా ఉండే జవాబు వ్రాయండి.

## భావపరిచయ పోటీ





8 మాటలకు మించకుండా పైన కని పిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి చమత్కారమైన లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

---

(57 వ పేజీ తరువాయి)

స్క్రీను కూడా తిరుగుతూ ద్వారాన్ని దూర దర్శిని సమరేఖలో ఉంచుతుంది. ముఖ్యంగా కావలూరులో ఆకాశం సంవత్సరంలో చాలా భాగం నిర్మలంగా ఉంటుంది!

---

"నిన్ను నీవు తెలిసికొన్నప్పుడు ఆంతరంగిక విప్లవం ఏర్పడుతుంది."

# పోటీలు (ఫలితాలు)

(ఏప్రిల్ 1986)

వ్యాసం-విజేతలు-మొదటి బహుమతి: ఎస్. మధుసూదనరావు, వసుంధర పోస్టు, (శ్రీకాకుళం జిల్లా); రెండవ బహుమతి: సురేంద్రరావు కులకర్ణి, బీర్కూరు, (నిజామాబాద్ జిల్లా); మూడవ బహుమతి: మల్లేపల్లి పురుషోత్తమరెడ్డి, శ్రీరామరంగాపురం (బళ్ళారి జిల్లా).

క్విజ్-జవాబులు: 1. నాసౌ (NASSAU) బహామా, 2. కపిల్‌దేవ్, 3. అంతర్జాతీయ శాంతి సంవత్సరం, 4. జనరల్ కె. సుందర్‌జీ, 5. బోర్డర్ రోడ్స్ ఆర్గనైజేషన్, ఈలం నేషనల్ లిబరేషన్ ఫ్రంట్, 6. సల్లైజ్, 7. కార్డినల్ కరోల్ జోసెఫ్ వోజ్‌టైలా, 8. మలయాళం.

విజేతలు-మొదటి బహుమతి: ఎమ్. చంద్రశేఖర రెడ్డి, పుంగనూరు, (చిత్తూరు జిల్లా): రెండవ బహుమతి: సి. శివశంకర్, హైద్రాబాద్; మూడవ బహుమతి. కె వి. ఉమామహేశ్వరన్, తిరుపతి.

పజిల్-జవాబులు-అడ్డం 1. ఎందరో మహానుభావులు, 6. బ్రహ్మ కడిగిన పాదము, 7. కుశాలుగా, 10. కనీనిక, 12. అందరికీ వందనములు, 14. ముక్కోణము, 15. ముకురము.

నిలువు: 1. ఎంత బ్రతుకు, 2. రోచకములు, 3. హాటగిరి, 4. భాషపాండిత్యసి, 5. లులముమక, 8. శారద, 9. గాజుకీరము, 10. కమ్మదనము, 11. నిత్యము, 12. అందము, 13. ఒగ్గుము.

విజేతలు-మొదటి బహుమతి: బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్, (ఆదిలాబాద్ జిల్లా); రెండవ బహుమతి: బి. ప్రత్యూష కుమారి, వరంగల్; మూడవ బహుమతి: టి. ప్రమోద్‌కుమార్, నిజామాబాద్.

తెలివికి పరీక్ష-జవాబులు 1. ఒకే గంట, రాత్రి పదకొండు గంటలకే అలారం కొట్టింది, 2. స్విట్జర్‌లాండ్-ఇది ఒక్కటే ద్వీపం కాదు, 3. 157, 4. వీరందరూ ప్రధాన మంత్రి పదవిని అధిష్ఠించినవారే, 5. వృద్ధాప్యాన్ని పొందడం, 6. అన్నీ 2చే భాగింపబడతాయి, 7. ఒకేసారి, 8. సంఖ్యలో

## తేడాలను తెలుసుకోండి

జవాబులు:

1. ఒక వ్యక్తి చెవి, 2. ఒక చేతి వ్రేలు లేదు, 3. బల్లపైన పండు, 4. గోడకు తగిలించిన పెయింటింగు, 5. పెట్టె, 6. తెర మడత.

"మురిపెము, తిరిపెము నరుని జీవితంలో వెన్నెలా, చీకటి."

గల చివరి అంకెని సంఖ్యముందు చేర్చాలి.

విజేతలు: ఎవరూ లేరు.

పొడుపు మహిమ - జవాబులు. 1. బాధ (ఎ), ఆపద (బి), భక్ష్యవిశేషము (సి); 2. గౌరవము (ఎ), అతిశయము (బి); 3. అందము (ఎ), విలాసము (బి); 4. యుద్ధభూమి (బి), క్షణకాలము (డి); 5. కోరిక (బి), సంతోషము (సి); 6. ఆడది (బి) ప్రబంధ విశేషము (డి); 7. దుక్కి ప్రారంభము (ఎ): 8. చతుర్ముఖుడు (బి), బ్రహ్మ (సి).

విజేతలు: మొదటి బహుమతి: బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్, (ఆదిలాబాద్ జిల్లా); రెండవ బహుమతి; ఇందుకూరి హేమనళిని, హైద్రాబాద్; మూడవ బహుమతి ఎస్. వెంకటరెడ్డి, కవిటం, (ప.గో. జిల్లా).

ముఖచిత్ర వ్యాఖ్య: మొదటి బహుమతి: ఎ. గీతాంజలి, మచిలీపట్నం; రెండవ బహుమతి· ఆర్.మధుమోహనరెడ్డి, మస్తూరు పోస్టు, (చిత్తూరు జిల్లా): మూడవ బహుమతి· అనీల్ కులకర్ణి, సిద్ధిపేట, (మెదక్ జిల్లా)

పాఠకుల అభిప్రాయాలు: మొదటి బహుమతి. ఇందుకూరి హేమనళిని, హైదరాబాదు; రెండవ బహుమతి: పాటూరు హరిప్రసాద్, ముదిగోళం పోస్టు, (చిత్తూరు

మీరైతే....? : రెండవ బహుమతి: పడాల శ్రీ శంకర మూలారెడ్డి, విజయవాడ; మూడవ బహుమతి: సుండి దేవకుమార్, మద్రాసు.

భావపరిచయ పోటీ: మొదటి బహుమతి. మంగిపూడి మాధవుడు, కాకినాడ; రెండవ బహుమతి బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్, (ఆదిలాబాద్ జిల్లా); మూడవ బహుమతి· ఎ కె. గిరిధర్, గూడూరు, (నెల్లూరు జిల్లా)

## ప్రపంచంలో మిక్కిలి ఎత్తైన జుత్తు ముడి



తలజుట్టు సింగారం టాప్‌నాట్, బ్రెయిడింగ్, బన్, పోనీటెయిల్, ఓపెన్‌హెయిర్, ఫ్రెంచిరోల్ అని అనేక రకాలు. కాని యూరప్ తూర్పున హంగేరీలోని గయార్ (gyor)లో జరిగిన ఎగ్జిబిషన్‌లో మహిళలు తలమీద జుట్టు 1.5 మీటర్ల గోపురంలా అమర్చుకున్నారు. ఇది ప్రపంచంలోనే మిక్కిలి ఎత్తైన శిరోజశృంగారము.

('మిషా' సౌజన్యంతో)

"చేపల వానితో స్నేహం కంటే అత్తరువుల వానితో కలహం మేలు."